# తప్పటడుగులు

(నవల)

★

రచన:

'హరగోపాల్'



★

కవితా పబ్లికేషన్స్
గోపువారిస్ట్రీట్ - విజయవాడ-2

కవితా ప్రచురణ
ప్రథమ ముద్రణ
అక్టోబరు 1961

★

వెల: 1–50

★



★

ముద్రణ:
శ్రీ శారదా ప్రెస్,
విజయవాడ - 2

★

సంపాదకులు:
నెప్పల్లె త్రివిక్రమరావు

# ఇతివృత్తము

ప్రతివారు పరిస్థితుల ప్రభావమువల్ల అనేక తప్పటడుగులు వేస్తునే వుంటారు. అవి తెలిసివేసినా తెలియక వేసినా కలిగే కష్టనష్టాలకు బాధ్యులు వారే కాగలరు. మంచిపని చేస్తే మంచిఫలితాన్ని పొందినట్లే, చెడ్డపని చేస్తే చెడ్డఫలితాన్ని పొందకతప్పదు. దీనినుంచి పూర్తిగా తప్పించుకోలేరు. కాలు జారితే తీసుకోగలిగినట్లు నోరు జారితే తీసుకోలేనట్లే, చేసిన తప్పులనన్నీ దిద్దుకోలేక పోవచ్చు. వాటి ఫలితాల నుంచి రక్షించుకోలేక పోవచ్చు.

ఎదుటివారి హృదయాన్ని తెలుసుకోకుండా చనువిచ్చి ఒకరూ, తమ మనస్సును నిగ్రహించుకోలేక ఒకరూ, అందరినీ అమాయకంగా నమ్మి ఒకరూ, అందరకూ మంచివారమౌదామని ప్రయత్నించి ఒకరూ తప్పటడుగులు వెయ్యగా ఏర్పడిన క్లిష్ట పస్థితులలో చిక్కుకున్న భిన్న ప్రవృత్తులుగల వ్యక్తుల జీవిత వరవడే యీ నవల.

— రచయిత.

## 5

# "తప్పటడుగులు"

ఆరోజు తలుచుకుంటే, ఇప్పటికీ నావళ్ళు జలదరిస్తుంది. మామయ్యకు సుస్తీగా ఉందంటె, ఏదో మామూలు జ్వరమే అయివుంటుంది. అదే నిమ్మళిస్తుందిలే అని ధైర్యంగానే ఉన్నాను. కానీ, మళ్ళీ టెలిగ్రాము వచ్చేసరికి నాకు ధైర్యం చిక్కబట్టలేదు. హైదరాబాద్ లా కాలేజీలో ఉన్న నేను రెక్కలు కట్టుకుని ఎగిరివాలాను మామయ్య మంచందగ్గర. మామయ్యకు స్పృహలేదు. లీల, అత్తయ్య, కంట తడిపెట్టుకుంటూ ప్రక్కనే నిలుచుని ఉన్నారు. డాక్టర్ ఒక ఇంజక్షన్ ఇచ్చి, అయిదు నిముషాల తరువాత నాడి చూచి, నావైపు చూచి పెదవి విరిచాడు. నా గుండె గుభేల్‌మంది. డాక్టర్ గార్ని వీధిగుమ్మంవరకు సాగనంపాను. డాక్టరు వెనుకకు తిరిగి, "ఈ రాత్రి గడుస్తుందని నాకు నమ్మకంలేదు. జాగ్రత్త." అన్నారు. నాకు ఏమనాలో బోధపడలేదు. డాక్టర్‌గారి రెండుచేతులు పట్టుకుని "ఆఁ!! రాత్రి గడవడం కష్టమేనా?" అన్నాను గద్గదస్వరంతో. నా మాటలకు డాక్టర్ నా వీపును ఆప్యాయంగా తట్టుతూ! "మిస్టర్ ఆనంద్! డాక్టర్ రోగానికి మందు నివ్వగలడుగాని ఆయుర్దాయానికి మందు నివ్వలేడు. ఎల్లా జరుగవలసింది అల్లా జరుగక తప్పదు. ధైర్యంగా ఉండి ఆ ఆడవాళ్ళకు ధైర్యం చెప్పు" అని తన కారుమీద ఆ చీకట్లో నిష్క్రమించాడు డాక్టర్. ఆ కారు ఆ చీకట్లో అదృశ్యమయ్యేవరకు అలా చూస్తూనే వుండిపోయాను. కండ్లవెంట

కారుతున్న వేడి కన్నీళ్ళను జేబురుమాలుతో తుడుచు కున్నాను. నా హృదయం విచారంతోటి బరువెక్కిపోయింది. ఏంచెయ్యడానికి పాలుపోవడం లేదు. తెల్లవారితే మహా శివరాత్రి. మహా పర్వదినం. ఆ రోజున అసువులు బాసిన వారికి కైలాసం వస్తుందంటారు. డాక్టర్ మావయ్య కైలా నానికి వెళ్ళక తప్పదన్నారు. రేపటినుంచి యింక మామయ్య లేడు, ఉండడు, ఇకరమ్మన్నా రాడు. నా మనసులో నేను ఎంతసేపో ఏడ్చాను. ఛీ! ఏమిటి? తప్పుడు ఆలోచన? మామయ్యకు గట్టిగా పట్టుపట్టి లెక్కపెట్టి ఏభైయేళ్ళు నిండ లేదు. ఏమో! డాక్టర్ పొరబడి ఉండవచ్చు. ఎన్నో నోములు వ్రతాలునోచిన మల్లమ్మ అత్తయ్యకా అంతకష్టము! పతివ్రతలు పోయిన భర్త ప్రాణాలనే మరల రప్పించారు. మల్లమ్మత్తయ్య మాత్ర మేమితక్కువ! అత్తయ్యకు మామ య్యకు జ్ఞానం తెలియని రోజులలో పెళ్ళి జరిగిందని అంతా చెప్పుకునేవారు. అత్తయ్యకు ఆ రేళ్ళయితే మామయ్యకు పన్నెండేళ్ళు. ఇప్పటికి షుమారు ముప్ఫైఏళ్ళక్రితం మాట రాత్రిలగ్నం అవడంవల్ల పెళ్ళిలో అత్తయ్య నిద్రవచ్చి మామయ్య వళ్ళోనే నిద్రపోయిందిట. ఆ తరువాత మామయ్య తన అత్తారింటికి వెళ్ళినప్పుడు అత్తయ్యను ఎత్తుకుని ఆడించే వాడట. ఏమిటో! ఆరోజులే వేరు, ఆవేడుకలే వేరు. అప్పటికి ఇప్పటికి ఏమీ పోలికలేదు. ఎంతో మార్పు వచ్చింది. అత్తయ్య పదునాలువ ఏటనే అత్తారింటికి వచ్చింది. అప్పటికి మామయ్య తన ఆస్తి వ్యవహారాలు తనే చూచుకోవడం ప్రారంభించాడు. అత్తయ్య అడుగు పెట్టగానే ఆ ఇంటికి

క్రొత్త శోభ వచ్చింది. అంతవరకు ఆ ఇంట్లో దీపం పెట్టేవారైనా లేకపోయారు. పాడుపడ్డకోటలా తయారైంది. ఆ తరువాత మామయ్య ఆ ఇంటిని బాగుచేయించి రంగువేయించాడు. ఇల్లా కొన్నాళ్ళు గడిచిన తరువాత "అన్నీ ఉన్న మనకు అల్లరిచేసే పాపాయి లేదే" అని ఎంతో బాధపడేవారు. చివరకు బెంగపెట్టుకున్నారు కూడా ! ఇక మామయ్య చెయ్యని దానంలేదు, అత్తయ్య నోయ్యని నోములేదు. చివరకు ఎల్లాగయితేనేం వాళ్ళు కోరుకున్న అల్లరి సిసింద్రీ యీ లీల పుట్టుకొచ్చింది. అది పుట్టడమే పెద్దగోల చేస్తూపుట్టింది. అంతేనా! ఉగ్గుపెట్టుదామంటే ఉగ్గుతాగేదా? పాలు పట్టుదామంటే పాలుతాగేదా? పాకడం వచ్చిన తరువాత దాన్ని పట్టుకోవడమే కష్టమయింది. క్రింద కూర్చోపెట్టితే గ్లాసులు చెంబులు గిరవాటు వేసేది. నూనెగిన్నెను నేతిగిన్నెను బోర్లించేది. "ఏమిటే ఇది?" అని అత్తయ్య అంటే కొట్టినట్టేడ్చి, మామయ్యచేత తిట్టించేది. ఇదికాదని అత్తయ్య మంచంమీద కూర్చోబెడితే దానిమీదనుంచి పనికట్టుకుని క్రిందపడి కక్కుటిల్లి ఏడ్చేది. పోనీలే ఏడుస్తోందని బొమ్మలు ముందరెడితే ఆడుకోవడానికి వాటిని క్షమితంగాకూర్చుకొని రెండుముక్కలు చేసి లోపల ఏముందో! అని పరిశీలనగా చూచేది. ఇల్లా అది రోజుకు ఎన్ని బొమ్మలు బ్రద్దలు కొట్టిందో! ఇక మాటలు వచ్చినతరువాత దాని అల్లరి వర్ణించడం కష్టం. వసపిట్టలా ప్రొద్దున లేచింది మొదలు పడుకునేవరకు ఒకటే వాగుడు వాగేది. పెరటిలోని మట్టితెచ్చి ఇల్లుకట్టి పేరంటాళ్ళను పిలిచి బొమ్మల పెళ్ళిచేసేది. పువ్వుల మొక్కలు

మొగ్గలు వద్దన్న తెంపేసేది. ఆ చెట్టుచాటున ఆ లతలచాటున దాక్కొని వాళ్ళన్నతో దోబూచులాడుతూ వేధించుకు తినేది తలదువ్వి మంచిబట్టలు కట్టితే అరగంట తిరగక ముందే జుట్టురేపుకునేది. బట్టలు మాపుకునేది. తోటిపిల్లతో గిల్లికజ్జాలు పెట్టుకుని వాళ్ళను నోరార తిట్టి, చేతులార కొట్టి నంగనాచిలా వాళ్ళ అమ్మదగ్గరకు వచ్చి నేరాలు చెప్పేది. ఈ విధంగా అది ఆడని ఆట లేదు, చేయని అల్లరిలేదు. లేక లేక పుట్టినందువల్ల, లీల ఏంచేసినా సంతోషంగానే ఉండేది అత్తయ్యకు మామయ్యకు. ఎవరు వాళ్ళ ఇంటికి వచ్చిన, ముందు లీల అల్లరిగురించి కనీసం ఒక అరగంటైన వర్ణించిగాని మాట్లాడేవారుగాదు. అత్తయ్య మామయ్య దాని అల్లరి అహ్లాదపడుతూ చెప్తుంటే గర్వంగా నవ్వేది లీల సోఫాలో కూర్చొని. ఆవిధంగా ఆ రోజులన్నీ ఎంతో ఆనందంగా వెళ్ళిపోయాయి. మొదటిరోజులలో మామయ్య కొంత కష్టపడ్డా, చివరి రోజులలో మామయ్య నవ్వుతోనే కాలం గడిపాడు ఎంతసేపు ఏడిస్తేమాత్రం ఏమిటి ప్రయోజనం? ఎవరూ ఇక్కడ శాశ్వతంగా ఉండరని కాలం చెల్లిన తరువాత వెళ్ళక తప్పదని అందరికీ తెలిసిన విషయమేకదా! మనసును చిక్కబట్టుకుని ఇంట్లోకి వచ్చాను. మామయ్య మంచం చుట్టూమూగి అందరూ గొల్లున ఏడుస్తున్నారు. నాకు ఏమీ తోచలేదు. పిల్లిలా అడుగులు వేసుకుంటూ ఆ మంచాన్ని సమీపించాను. నేను అక్కడకు రాగానే అత్తయ్య లీల నన్ను చూచి మరీ విలపించసాగారు. నాకు వారిలా ఏడవాలనిపించింది. కానీ, ధైర్యం తెచ్చుకున్నా. "అన్ని

తెలిసిన దానివి, మాకు చెప్పవలసిన దానివి నువ్వు చెప్పించుకోవడమా? చూడు నిన్ను చూసి లీల ఎంత బెంబేలు పడుతోందో" అన్నా అత్తయ్యతో.

"చదువుకున్న దానివి ఏమిటి లీల చంటిపిల్లలా. ఏమి భయంలేదు ధైర్యంగా ఉండు" అని ఆమె తల నిమిరాను.

మామయ్యకు ఆఖరి గడియలు సమీపించాయి. ఏదో చెప్పాలని ఏమిటో చెయ్యాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు. నోరు పెకలడంలేదు. చెయ్యి లేవడంలేదు. దగ్గరకు వెళ్ళి ఆయన చెయ్యిపట్టుకున్నాను. ఆయన మృత్యువుతో ఎడతెరిపి లేకుండా పోరాడుతున్నాడు. పోరాటంలో గెలవలేనని ఆయనకు తెలుసు. ఆయన నిరాశ చెందడంలేదు. శత్రువుముందు తలవంచడంలేదు. చాలాసేపు తీవ్రంగానే పోరాడారు. ఆయనకున్న జవసత్వాలు ఉడిగిపోయాయి. శత్రువుతో సంధి చేసుకున్నారు. నీతో వస్తాను. అన్నీ మావాళ్ళకప్పచెప్పి నీతో ఎక్కడకురమ్మంటే అక్కడకు వస్తాను. ఒక్క నిమిషం నాకు వ్యవధినివ్వు" అని అడిగి అంగీకారంపొందే ఉంటారు. అకస్మాత్తుగా 'ఆనంద్!' అని బిగ్గరగా అరిచారు.

"ఏం మామయ్యా! ఇక్కడే ఉన్నాను" అన్నాను ఆయన చెయ్యి గట్టిగా పట్టుకుని. నన్ను చూడగానే ఆయనకు దుఃఖం పొంగివచ్చింది.

"మీ అత్తయ్య లీల ఎక్కడా?" ఆశగా అడిగారు "ఇదుగో!" అని నా వెనుకనున్న వాళ్ళను ముందుకు రప్పించి చూపాను. లీల తలమీద చెయ్యివేసి, 'వదలి వెళ్ళిపోతున్నానే' అని కన్నీటివర్షం కురిపించారు. ఆఖరిసారిగా

అత్తయ్య చేసిన నమస్కారాన్ని మనస్ఫూర్తిగా స్వీకరించారు. "ఏమేవ్! నీకు ఏలోటు రాదు. బెంగెట్టుకోకు. అన్నింటికి ఆనంద్ ఉన్నాడు. లీలా జాగ్రత్త!" అని హెచ్చరించారు.

"అమ్మా లీలా! శ్రద్ధగా చదువుకుని బుద్ధిగా బ్రతుకు" అని ఉపదేశించారు. నావైపుకు చూచి నా చెయ్యిని తన ముఖందగ్గర పెట్టుకుని భోరున ఏడ్చారు. "మామయ్యా! ఏమిటిది? పెద్దవాడివి నువ్వుగూడ యిలా ప్రవర్తించడమా!" అన్నాను వణుకుతున్న కంఠంతో. "ఆనంద్! నాకు ఏవిచారము ఏలోటు లేదు. ఒక్కటే బాధ. లీలకు పెళ్ళిచేయకుండానే... అని అంటూవుండగా ఆయన నోరు మూసాను. తప్పు! అవేం మాటలు. లీలకేంలోటు. కావాలంటే రేపే దానిపెళ్ళి చేయిస్తాను" అన్నాను.

"నాకు తెలుసు. నీమీద నాకు ఆ నమ్మకముంది. ఆనంద్! లీల అమాయకురాలు. అభంసుభం తెలియనిది. వట్టి తొందరపిల్ల. మంచికైన, చెడ్డకైన నువ్వే. దాన్ని నీ చేతులలో పెట్టుతున్నాను. ఎల్లా చూచుకుంటావో" అన్నారు గుడ్లనీరు గుడ్లన కుక్కుతూ "లీలనుగూర్చి నీవు ఏవిచారం పెట్టుకోకు. నామీద నీవుంచిన భారాన్ని బాధ్యతను సంతోషంగా స్వీకరిస్తున్నాను. నా శక్తివంచనలేకుండా నా వాగ్దానాన్ని నేను నిలబెట్టుకుంటాను" అన్నాను ఉద్వేగంతో.

"ఆనంద్! నాకేచింత లేదు ఆనంద్ నాకేచింత లేదు. అనందంగా నిద్రపోతాను ఆనంద్! ఇంక లేవను. నన్ను లేపకండి!" అని అంటూనే మామయ్య కళ్ళు మూసారు. అత్తయ్య లీల గొల్లున ఏడ్చారు. మహాశివరాత్రినాడు మహా

పుణ్యాదినాన మామయ్య తనధర్మాన్ని నిర్వహించి కార్యభారం నాకు వప్పగించి కైలాసం వెళ్ళిపోయాడు విశ్రాంతితీసుకోవడానికి. అంతటితో మామయ్య జీవితమయిపోయింది. ఆయన తోడుక్కునేజోళ్ళు, ఉపయోగించే చేతిబెత్తం, కళ్ళజోడు, స్నేహితుని సహచరుని యజమానిని కోల్పోయామని, ఇంక మాబ్రతుకెందుకని ఏడుస్తూన్నట్లు బూజుపట్టిపోయాయి. ఎప్పుడైనా ఇంటికి వస్తే "ఓ ఆనంద్! వచ్చావా! రా కూర్చో!" అని ఆప్యాయంగా అనే మామయ్య, గోడమీద పూలదండతో, ఫొటోరూపంలో ఇవ్వాళ ఆహ్వానిస్తాడు.

అప్పటికి నాకు సరిగా పదేళ్ళు. అప్పటికే మా నాన్న పోయాడు. మా అమ్మ మంచానపట్టితే, మామయ్య మా యింటికి వచ్చాడు. నాకుమల్లేనే మామయ్యకూడ మా అమ్మకు వాగ్దానంచేశాడు. అక్కా! నీవు ఆనంద్ విషయంలో బెంగపెట్టుకోకు. బావ వకీలుగా ఎంతో పేరు పొందాడు. ఆనంద్‌కుగూడ వకీలే చెప్పిస్తాను. బావ పేరు నిలబెట్టడమేకాకుండా నీకూ నాకూం గూడా కీర్తి తెస్తాడు!" అన్నాడు మా అమ్మ "నా బాబు వకీలు! నా ఆనంద్‌వకీలు" అని పలవరిస్తూనే కళ్ళుమూసింది. ఆనాటినుంచి నేను మామయ్యదగ్గరే పెరిగాను. మామయ్య ఇంటికివచ్చిన కొత్త రోజులలో నాకు మా అమ్మ గుర్తుకువస్తే, అర్ధరాత్రులప్పుడు సీధి అరుగుమీదకువచ్చి ఎంతోసేపు ఏడ్చేవాడిని. సాయంత్రమప్పుడు డాబా ఎక్కి, పిట్టగోడమీద అమ్మను గూర్చి ఆలోచిస్తూ కూర్చునేవాడిని. మా అమ్మ నాకోసం ఎంత కష్టపడింది! నామీద ఎన్ని ఆశలు పెట్టుకుంది!

పాపం! ఏ ముచ్చట తీరకముందే నన్నువదిలి వెళ్ళిపోయింది. నేనెందుకు బ్రతకాలి! ఎవరికోసం బ్రతకాలి? ఏమో! నాకే తెలియదు. మా అమ్మ నన్ను మామయ్యదగ్గర బ్రతకమంది. వకీలు చదవమంది. నాన్నపేరు నిలపమంది. ఇల్లా ఎందుకు చెయ్యమందో నాకు తెలియదు. నేను అడగలేదు. నాకు అక్కరలేదుకూడ. మా అమ్మ చెయ్యమంది కనుక ఇల్లాగే చేస్తా అని అదేవిధంగా ఆలోచిస్తూ నాలోనేను మనసులో ఏడుస్తోంటే మామయ్య పసికట్టి, "నాయనా ఆనంద్! అమ్మ కోసం ఏడుస్తున్నావా?అమ్మజ్ఞాపకంవచ్చిందా నాయనా!నీకు నేను ఏలోటు రానీయను. నీకు ఎవరులేకున్న నేనుఉన్నాను. బాబు బెంగపెట్టుకోకు! చనిపోయిన అమ్మను తీసుకురాలేను కాని, నీవు కావాలంటె కొండమీద బొమ్మనుగూడ తీసుకు వస్తాను. ఏమి లోటు నేను బ్రతికుండగా రానీయను" అని నాతోపాటు తనూ ఏడుస్తూ, కారుతున్న కన్నీరు తుడుచుకుంటూ నన్నుఅనేకమార్లు బుజ్జగించేవాడు. నేను విచారాన్ని మర్చిపోవడానికి సినీమాలకు తీసుకువెళ్ళి తనతోపాటు బీచి వడ్డుకు తీసుకువెళ్ళి, నేను మొహం వాలేసినప్పుడల్లా, చిన్న చిన్న పిట్టకథలుచెప్పి, నాదగ్గరే తనుగూడా పడుకుని, ఈ విధంగా నన్ను కంటికి రెప్పలా కాపాడి ఇంతవాణ్ణిచేశాడు. ఈ సంవత్సరం పేపర్లు రాసివచ్చాను. నేడో రేపో ఫలితాలు గూడ తెలుస్తాయి, అని నేను అనుకుంటూ ఉండగానే లీల పరిగెత్తుకుంటూవచ్చి "బావా నువ్వు పాసయ్యావు ఇదిగో నీ నెంబరు" అంది వగరుస్తు. "అల్లాగా! అయితే మంచిదే" అన్నాను తాపీగా.

"ఔరా! పరీక్ష పాసయ్యావంటే ఎగిరి గంతేసింపోయి" అలాగా! అయితే మంచిదే అని చప్పరిస్తావా! అందంగానే ఉంది వరస. కాళ్ళు నెప్పులుపెట్టేలా పరిగెత్తి మెట్లెక్కి (శ్రీ)వారికి మనవిచేస్తే ఇదా మీరిచ్చే బహుమానం. అబ్బో! కడుపు నిండిపోయింది" అని మూతి విరుచుకుంటూ వెళ్ళిపోయింది లీల. ఆమెను చూస్తే చచ్చేటంత నవ్వు వచ్చింది. నేను వెంటనే లేచి అత్తయ్యగదిలోకి వెళ్ళాను. ఆమె అప్పుడు దేవతార్చనచేసి ప్రసాదం తీసుకుని ఎదురువస్తోంది. నన్ను చూచి, "ఇదిగో! ఆనంద్! ప్రసాదం" అంది. నేను ప్రసాదం తీసుకున్నాను. "అత్తయ్యా! నీకు తెలుసా! నేను లా పాసయ్యాను" అన్నాను. "నువ్వు వేరే చెప్పాలా నాయనా! నాకు ఎప్పుడో తెలుసు. ఇక త్వరలోనే మన వూళ్ళో ప్రాక్టీసు పెట్టు. మీ అమ్మ నిన్ను వకీలుగా చూడాలని ఎంతో ఉబలాటపడేది. అది చూచుకోడానికి నోచుకోలేదు" అని కంటతడి పెట్టుకుంది అత్తయ్య.

"ఏమిటో! అత్తయ్యా! ప్రాక్టీస్ పెట్టడానికి నా మనసేమీ బాగాలేదు. కష్టపడి చదివించిన మామయ్యగూడ లేకపోయాడు. ప్రాక్టీస్ చూడడానికి" అన్నాను గద్గద స్వరంతో.

"ఏంచేస్తాం నాయనా! ఎవరెంత పెట్టిపుట్టితే అంత. నీవు ప్రాక్టీస్ పెడితే ఎదురుగావుండి చూడలేకపోయినా చాటుగా ఉండైనా దీవిస్తారు. మనసు పాడుచేసుకోక త్వరలోనే ఆపని చెయ్యి" అంది కళ్ళనీరు వత్తుకుంటు. ఇంతలో లీల అక్కడకువచ్చి నవ్వుతూ "ఎవరు చూడడానికి లేకపోతే నేను

ఉన్నానుగ. ఏ కేసులు నిన్ను వెతుక్కు రాకపోతే నేను తెచ్చే కేసులు చాలు. చాలకపోతే చెప్పు, కుప్పలు కుప్పలు కురిపిస్తాను" అంది నవ్వుతూ.

"చూశావుగా నాయనా దీని పొగరు! తొందరలోనే దీని ముక్కుకు తాడువెయ్యకపోతే పట్టుకోవడం కష్టం" అంది అత్తయ్య.

"బావా! ఇప్పుడే చెబుతున్నాను. ముక్కుకు తాడు వెయ్యడానికి ముక్కుకుట్టిస్తే నేను ఊరుకోను, కావలిస్తే చెవులు కుట్టించుకో నాకు అభ్యంతరం లేదు. లేకపోతే ముక్కు కుట్టుకోవడమేమిటి ? ఛీ! ఫేషనా ! పాడా!" అంది ముఖం చిట్లిస్తూ

"ఏడిశావులే! కొంటెమాటలు నీవు కొంటెపిల్ల ! ఈ ప్రసాదం తీసుకుని తొందరగాపో. కాలేజీకి టైం అయింది" అంది అత్తయ్య.

లీల ప్రసాదం తీసుకుని "బావా ! ఇవాళ లాస్టు టు హావర్సు [Last two hours] ఖాళీ. అందుచేత పెందరాడే వస్తాను. బీచికి వెళ్ళాలి. సిద్ధంగా ఉండు. రోజూలా వంక పెడితే వీలులేదు" అని అంటూ పరుగుతీసింది బయటకు.

నేనూ అత్తయ్య లీల చేష్టలకు నవ్వకుండా ఉండలేక పోయాము. రోజూ లీల ఇట్లా ఏదోవిధంగా గోలచేస్తూ, అల్లరి చేస్తూ, మా దుఃఖాలను మర్చిపోవడానికి అవకాశం కల్పిస్తోంది.

నా సంకల్పబలంవల్ల, అత్తయ్య ఆశీర్వాదం బలంవల్ల నేను యీ ఊళ్ళోనేవుండి యీ ఇంట్లోనే, వీళ్ళను కనిపెట్టు

కుని వుంటూ ప్రాక్టీస్ పెట్టాను. చిత్తశుద్ధితో శక్తివంచన లేకుండా శ్రమపడి, నా తల్లిదండ్రుల కలలకు మా మామయ్య కోర్కెలకు రూపకల్పన చేయసాగాను.

లీల కొంటెపిల్లని చెప్పనే చెప్పానుగా! పైగా మీరు చూశారు గూడా దాని వరస. దానికి నేనంటే ప్రాణం. కాదుమరి! అదీ నేను ఒకచోట కలిసి పెరిగాము. మా చిన్నతనంలో అదీ నేను ఎన్నిసార్లు కొట్లాడుకొని ఏడ్చామో! ఎన్నిసార్లు "నీకు నాకు జట్టులేదు కావు కావు" అని ఎక్కిరించుకున్నామో ! అదేవిధంగా అదీ నేను కలిసి మా పెరటిలోను మా డాబా మీద ఎన్ని ఆటలు ఆడామో! అటువంటప్పుడు అదీ నేనంటె పడిచస్తుందని వేరే చెప్పాలా? అప్పుడంతా కలసికట్టుగా ఉన్నప్పుడు ఇప్పుడు కూడా అల్లాగే ఉన్నామని వేరే చెప్పాలా? లీల నేను కోర్టుకు వెడుతున్నప్పుడు వస్తున్నప్పుడు నాకు చాల సహాయం చేసేది. అంతటితో ఊరుకునేదా? "నేను వస్తాను బావా! కోర్టుకు. నీ బదులు కోర్టులో నేను వాదిస్తాను. ఏమని వాదించాలో చెప్పు. రిహార్సల్ వేసుకుంటాను" అని మారాము చేసేది. దాని చిలిపి చేష్టలకు కొంటె పనులకు కొట్టాలో తిట్టాలో గూడ తెలిసేదిగాదు. దాని అమాయకత్వానికి నా మనసులోనే జాలి పడేవాడిని. లీల అతిగా అల్లరి చేసినప్పుడు నేను విసుక్కుంటే, చురచురా చూస్తూ నిల్చిపోయేది. ఆ చూపులోనే కోపం తగులుకొని సాలిగూడులో పురుగులా గిలగిల తన్నుకునేది. దాని చేష్టలు గూర్చి ఇలా చెబుతోంటే అది ఎకిలి పిల్ల, వెర్రిపిల్ల అనుకుంటారేమో! హేమాహేమీలు

గూడ దానిదగ్గర కెలవలేదు. మా లీల చాలా చమత్కా-
రంగా మాట్లాడగలదు. ఏ మాట మాట్లాడినా, రెండర్థాలు
వస్తాయి. తేనె పెదవుల కదలికతో, హృదయ కుహరం
నుండి వీచు గాలితో వెలువడ్డ ఆ మృదు మధుర పదశైలికి
కోయిల కూతకు ప్రకృతిరీతిని ముగ్ధులు కాగలరు. జాగ్రత్త!
దానికి ఉదయం నాతో కోర్టుకు రావాలని ఎంత
ఉబలాటమో, సాయంత్రమప్పుడు నాతో బీచికి పోవాలని
అంత ఉబలాటము. లీల సంధ్యాకాలంలో బీచికి పోదామని
వేపించుకు తినని రోజు లేదు. నేను దానితో కలిసి వెళ్ళిన
రోజు లేదు. ఉద్యోగరీత్యా ఆమెతో సరదాగా గడిపే రోజే
దొరికలేదు. నేను రాలేనని దీనంగా అంటే, అది మిర్రిగ రెబు
ముఖం చేసుకుని వెళ్ళిపోయేది. నా మనసు బాధపడేది.
కానీ, ఏంచెయ్యను. బోలెడు ప్రాక్టీసాయె!

మల్లమ్మ అత్తయ్యకు ఎంతసేపూ దైవభక్తి. అందు
చేత అంతగా అత్తయ్యతో ముచ్చటించ లేకపోయేవాడిని.
అథవా అత్తయ్య నాతో మాట్లాడితే లీల పెళ్ళివిషయం
ఎత్తేది. లీలకు నచ్చిన వరుడు దొరికితే పెళ్ళి చెయ్యడానికి
నాకేమి అభ్యంతరం లేదనేవాడిని. ఔనుమరి! లీలకు ఎటు
వంటి వరుడు నచ్చుతాడో నాకేం తెలుసు? అటువంటప్పుడు
నేను స్వతంత్రించి దాని ఇష్టానిష్టంతో నిమిత్తం లేకుండ ఏ
తలమాసిన వాడినో తీసికొచ్చి, పెళ్ళిచేసి, అపురూప వతియైన
ఆమె లేతహృదయాన్ని బాధ పెట్టి నేను సాధించేదేముంది?
అందుచేతనే "ఆమె తన వరుణ్ణి వెతుకు-నేవరకు వదిలేశా"
ననే వాడిని చిలిపిగా. నా మాటలకు అత్తయ్య నవ్వుతూ

"తెలివిగా మాటలంతా చెబుతారు. చేతలలో తేలుతుంది బండారం. ఆడపిల్లవాళ్ళం గనుక మనమే అన్వేషణకు బయలుదేరాలి" అని అనేది. నేను యిట్లా మాట్లాడుతోంటే లీల పొంచి పొంచి వింటూ వుండేది.

ఇదే విధంగా మేమందరం నవ్వుముఖాలతో చాలా రోజులు గడిపాము. సూర్యుడు ఎన్నిసార్లు ఉదయించాడో, చందమామ నన్ను ఎన్నిసార్లు పలకరించిందో నేను లెక్క-పెట్టలేదు. లెక్క-పెడితే చెప్పి ఉండేవాడిని. మా పెరటిలోని చెట్లు ఎన్నిసార్లు ఆకులు రాల్చాయో, ఎన్నిసార్లు ఎండి పోయాయో, ఎన్నిసార్లు చిగురించాయో, ఎన్నిసార్లు పుష్పించాయో నాకు సరిగా గుర్తులేదు. అస్తమానం తోటలో ఉండి, తన ఇష్టమొచ్చినట్లుగా పువ్వులను తురుముకుని, నిర్దాక్షిణ్యంగా సూదులతో దండలు గుచ్చి తలలో పెట్టు కున్న లీలకు తెలుసునేమో! అడిగి వ్రాద్దామంటే, అది తిన్న నయినది కాదు. "ఎందుకు?" అని ప్రశ్నిస్తుంది. అంతటితో ఊరుకోదు. చెప్పేదాక నన్ను వేధించుకు తింటుంది. చివరకు అది చెప్పడమూ జరుగదు నేను తెలుసుకోవడం జరుగదు. మన కథకు కాస్త కాల విలంబన మాత్రం జరుగుతుంది. మేఘాలు లేని నిర్మలాకాశంలాగ, తరంగాలు లేని కొలనులాగ ప్రశాంతమైన హృదయాలతో మేము చాలా రోజులే—ఎన్ని రోజులో మాత్రం గుర్తులేదు. ఉల్లాసంగా గడిపాము. వసంత కాలం కోకిలలకు ఎంత ప్రీకరమో! శుక్లపక్షము చకోరము లకు ఎంత ఆనందదాయకమో! యీ రోజులుగూడ మాకు అంత ప్రీతికరము, అంత ఆనందకరము, మరుపురానివి, మధు

రమైనవి, మళ్లీ మళ్లీ రమ్మంటే తిరిగి రానివి. మనసులోనే తలుచుకుని మధురానుభూతి పొందతగిన కమ్మని రోజులు అవి.

ఒకరోజున నేను కోర్టునుంచి కారుడ్రైవ్ చేసుకుంటూ పరధ్యాన్నంగా తిరిగి వస్తోంటే, కారు కడ్డంగా ఒక వ్యక్తి వచ్చి కెవ్వున కేకపెట్టింది. కారుకు సడన్ బ్రేక్ వేసి, "ఎవరా?"అని బయటకువచ్చి తీరా చూస్తేగదా! లీల. "కారు నడుపుతున్న కాస్త్రైనా నీవు నీలో వుండడం మంచిది. బావా!" అని అంది మూతి ముడుచుకుని. దాని మాటలకు నవ్వుతూ, "ఏం? లీల కాలుకు దెబ్బ తగిలిందా?" అని అడిగాను. "ఏం? తగలకపోతే దెబ్బ తగిలిస్తావా?"అని అడిగింది ముఖం చిట్లించుకుని.

"ఏం? దెబ్బలు తినాలని సరదాగా వుందా? లీలా! నడుస్తున్న కాస్త్రైన నీవు నీలో వుండడం మంచిది కదూ!" అన్నాను నవ్వుతూ.

"పో బావా!" అని తను గూడ నవ్వకుండా వుందామని ప్రయత్నించింది. ఓడిపోయి నవ్వింది నా నవ్వులో నవ్వు కలుపుతూ.

"ఇవాళ నడిచి వస్తున్నావేం?" ప్రశ్నించాను.

"డ్రైవర్‌ని అయిదింటికి రమ్మన్నాను. కానీ నాకు నాలుగింటికే కాలేజీ వదిలేశారు. ఆఖరి Hour మేష్టారు రాలేదు. శ్యామల తన ఇంటికి రమ్మని బ్రతిమాలితే వెళ్ళి మనయిల్లు దగ్గరేకదా! నడిచి పోదాంలేనని తిరిగి వస్తున్నాను" అంది మీటు నొక్కిన రేడియోలా.

"సరే! రా! కారెక్కు ఇద్దరం పోదాం" అన్నాను.

వెంటనే డోరులాగి తను డ్రైవ్ చేసేచోట కూర్చుంది. నేనుగూడ రెండవవైపు డోరులాగి కూర్చున్నాను. లీల కారు డ్రైవ్ చేసింది.

"తమరు డ్రైవ్ చేస్తున్నారు. ఎవరికి రోజులు దగ్గర కొచ్చాయి?" అని ప్రశ్నించాను.

"చూస్తావుగా! తినబోతూ రుచి అడుగుతా వేం?" అంది చిరుకోపాన్ని ప్రదర్శిస్తూ.

కారును మెయిన్ రోడ్డుమీద తన శక్తికొలది అతి వేగంగా పరుగెత్తిస్తోంది లీల. గాలికి దాని శిరోజాలు దాని కన్నులకు అడ్డంవస్తూ పోతూ దోబూచు లాడుతున్నాయి. కారు ముందుకు పరుగెడుతోంటే బాట వెనుకకు పరుగెడు తోంది. బాటమీద నున్న చెట్లు, మేకలు నవ్వుతో స్వాగతం చెప్తుతున్నట్లున్నాయి.

"లీలా! యీ రోడ్డు పట్టించావేమిటి? అదీ మన ఇంటి కెళ్ళేరోడ్డు" అన్నాను ఆతృతగా.

"తెలుసు! జ్ఞాపకం చెయ్యనక్కరలేదు. సాయంత్రం అయిదు గంటలవేళ సరదాగా షికారుపోక ముసలమ్మలా ఇంటికి పోదాం అంటావు ఎక్కడో! ఏం రాచకార్యం మునిగి పోతోంది. ఇంటికి పోవడానికి" అంది జోరుగా లీల, జోరుగా కారు నడుపుతూ.

"కొంపదీసి బీచిదారి పట్టిస్తావేమిటి కారుని? రేపు నేను సమనులు పంపాలి. నాకు ఎంతో పనివుంది. పార్టీ వాళ్ళు ఏడుస్తారు" అన్నాను ఆందోళనను వ్యక్తపరుస్తు.

"ఏడ్చేవాళ్ళు ఎల్లాగా ఏడుస్తారు. వాళ్ళకోసం మనం ఎందుకు ఏడవాలి? వీల్లేదు. ఇవాళ ఏమైన బీచికిపోవలసిందే!" పట్టుపట్టింది లీల.

"బీచీకే! అంతదూరమే! వద్దు, నా మాట విను. ఇద్దరం ఇంటికెళ్ళడం ఆలస్యమైతే అత్తయ్య కంగారు పడుతుంది."

"కాసేపు కంగారుపడితే ఏం భయంలేదు. వెళ్ళిన తరువాత ఇద్దరం సముదాయిద్దాములే."

"లీలా! ఏమిటా కొంటె మాటలు! పెంకిపట్టు" కసిరాను.

వెంటనే లీల విసురుగా సడన్ బ్రేక్ వేసింది. యిద్దరం కాస ముందు వుండే అద్దంమీదకు వరిగిపోయాము. కోపంగా లీల డోరు తెరుచుకుని "అయితే తమరు వెళ్ళవచ్చు, నేను రాను" అంది.

ఆమె చెయ్యి పట్టుకుని కారులోకి లాగాను. "లీలా! ఏమిటిది చిన్నపిల్లలా? రోజు వెళుతున్నావుగా! ఒక్కరోజు నా కోసం బీచికి మానేస్తే ఏం?" బుజ్జగిస్తు ప్రశ్నించాను.

"అల్లాగేం పాపం! రోజూ ఈవేళప్పుడు యింటికి పోతున్నావు కదా! ఒక్కరోజు నాతో వస్తే ఏం?" నిల దీసింది లా పాయింటు చూపి లీల.

"సరే! బీచికి మాత్రం వద్దు చాలా దూరం. యిక్కడ ఏపార్కులోకైనా పోయి పదినిమిషాలుండి పోదాం" అన్నాను ఏమనలేక. లీలగూడ పెంకిపట్టు వదిలి, నేనుకోరిన షరతు నంగీకరించి సంధికి ఒప్పుకుంది. ఒక్క అయిదు నిమిషాలలో లీల కారును తీసుకువచ్చి "ప్రకాశం పార్కు" ముందు ఆపింది.

రేడియో పాడుతోంది. చల్లగాలి వీచుతోంది. ప్రజలు, పిల్లలు కేరింతాలు కొడుతున్నారు. లీల దక్షిణం వైపుకు నడుస్తోంది. నేనామెను వెంబడిస్తున్నాను. లీల వెనక్కు వెనక్కు నాకేసి చూస్తూ లేడిలా నడుస్తోంది. ఆ పార్కులో బారులు దీర్చిన దారులగుండా నేనూ లీలా నడిచి వెడుతోంటే రకరకాల మొక్కలు, వాటి చాటున రకరకాల మనుషుల. వారి రకరకాల మాటలు కనిపిస్తున్నాయి, వినిపిస్తున్నాయి. లీల నడుస్తూ, దారిలో దాని చేతికందిన ప్రతిమొక్క ఆకునో, పువ్వునో గిల్లుతోనో, కొట్టుతూనో, వయ్యారంగా నడుస్తోంది. రకరకాల పక్షులు చెట్లపై వాలి కీచుకీచుమని శబ్దం చేస్తున్నాయి. తుమ్మెదలు జుంమ్మని శబ్దం చేస్తు ప్రతి పువ్వుమీద వాలుతూ ఎగురుతూ ఉన్నాయి. రంగురంగుల విద్యుత్ దీపాలు పార్కులో వెలుగుతూ ఆరుతూ వింత శోభను కూర్చుతున్నాయి. ఆ పార్కు చుట్టూరా వలయాకారంగా రంగురంగుల దీపాలు అమర్చారు. ఆ దీపాలు ఒకచోటనుంచి వెలుగుతూ పోయిపోయి మళ్ళీ అదే ప్రదేశానికి వచ్చి బాగా కాంతినిచ్చి మళ్ళీ ఆరిపోయి మళ్ళీ అదేవిధంగా వెలుగుతున్నాయి. రంగు రంగుల బుడగలను రకరకాల బూరాలను అమ్ముతూ కొందరు, బటానీలు, వేరుసెనగలు అమ్ముతూ కొందరు, ఆశగా అందరికేసి చూస్తూ తిరుగుతున్నారు. అవన్నీ ఆ పార్కులో చూస్తుంటే నా మనసు పరిపరి విధాల పోయింది. అదిగో! అక్కడ ఖరీదుగల దుస్తులు తొడుగుకుని నీటుగా ముస్తాబైన ఆ సుందరిని, చిరిగిన దుస్తులతో రేగిన జుట్టుతో

ఆ సుందరి యాచిస్తోంది. ఎంత హృదయ విదారకమైన దృశ్యం. నేనే కవినైతే నా బాధను మీకు తెలిసేలా ఎంత విపులంగా వివరించేవాడిని! అందరం భారతమాత బిడ్డల మైన, మనం స్వాతంత్ర్య వాయువులను పీలుస్తున్నా, ఒకరి చెయ్యిపైన, మరియొకరి చెయ్యి క్రింద. ఇది ఇచ్చేవారికి పుచ్చుకొనేవారికి ఎంత అవమానకరం? నిప్పటికైనా యీ దుస్థితి మారుతుందా? ఎప్పటికైనా అందరూ అన్నదమ్ముల వలె మన తల్లిసంపదను సమంగా పంచుకుని సంతోషంగా గడిపే రోజు వస్తుందా? ఇలా మనసు పాడుచేసుకుని నడు స్తున్న నన్ను ఒక బీద పిల్లవాడు అడ్డగించి నమస్కరించాడు.

"ఏం బాబూ! ఏం కావాలి!" అని అడిగాను ఆప్యా యంగా.

"బాబూ! నేను కాలేజీలో ఫ్రీ యూనివర్సిటీ చదువు తున్నాను. ఈ ఒక్క నెల జీతం కడితే నేను పరీక్ష ప్యాసవు తాను. నాకు తలిదండ్రులులేరు. మా అన్నయ్య నాకు జీతం కట్టను చదువు మానెయ్యమని తిట్టాడు. ఎంతో ఆశపెట్టుకుని కాలేజీలో జేర్పించిన మా అమ్మ మధ్యలోనే పోయింది. దాంతో మాఅన్నయ్య నాకు చదువు మానిపిస్తానంటున్నాడు. బాబూ! మీరు కనికరిస్తే ఈ ఒక్క పరీక్ష రాసి ఇక చదువు మానుకుంటాను" అని భోరున ఏడ్చాడు. నా గుండె తరుక్కు పోయింది. మా అమ్మకూడ నామీద ఎంతో ఆశపెట్టుకుని ఎన్నో కలలుకంది. మామయ్య మంచివాడుగనుక సరిపో యింది. లేకపోతే నేనుగూడ ఇల్లాగే యీ పార్కుల్లో తిరగ వలసి వచ్చేదేమో! నా కళ్ళవెంట అప్రయత్నంగా కన్నీళ్లు

తిరిగాయి. "బాబూ! ఏడవకు. రేపు మా యింటికి రా. మా యిల్లు తెలుసా? సీతానగరంలో కనకాచలం స్ట్రీటులో లైబ్రరీ ప్రక్కన వున్న డాబా. అక్కడకు వచ్చి వకీలు ఆనంద్ గారు ఎవరంటే అంతా చెబుతారు."

"అల్లాగేనండీ! నమస్కారమండి!" అన్నాడు కళ్ళనీళ్ళు తుడుచుకుని.

"బాబూ! నిన్నేమి చదువమని మీ అమ్మ యీ క్లాసులో చేర్పించింది?" వెళ్ళిపోతున్న వాడ్ని ప్రశ్నించి ఆపాను.

"డాక్టర్ చదవమన్నదండి!" అన్నాడు బిక్కమొహం పెట్టి.

"నీకు స్కాలర్‌షిప్ యిప్పిస్తాను, అల్లాగె చదువుదువు గాని, బెంగ పెట్టుకోకు. రేపు తప్పకుండా కనిపించు" అని బుజ్జగించి ఆకుర్రాడ్ని పంపాను. ఔరా! కాలం ఎంతచిత్రంగా పరుగు తీస్తోంది! చదువుకుందా మనుకున్న వారికి చదువుకోవ డానికి అవకాశం లేదు. చదువు వద్దనుకునే వారికి గుక్క తిప్పుకోలేనంత చదువు. భగవంతుడా! ఏమిటీ విపరీతం? ఏమిటీ పరీక్ష? ఎప్పటికి తండ్రి యీ దీనులకు ముక్తి? బాధగా అడుగులు వేసుకుంటూ నడువసాగాను.

"అదేమిటి బావా! కాళిదాసులా ముఖం పెట్టావ్?" అని ప్రశ్నించింది. ఉలిక్కిపడి చూశాను. ఒక సిమెంటు బెంచి దగ్గర నవ్వుతూ నిలుచుంది లీల. ప్రయత్నంమీద నవ్వు తెచ్చుకుని నవ్వుతూ బెంచీమీద చతికిలపడ్డాను. లీలకూడ కూర్చుంది. చాలాసేపు ఇద్దరం మౌనంగానే ఉన్నాము.

ప్రకృతి కేసి తేరిపార చూశాము. లీల ఏదో చెప్పబోయి మళ్ళీ మానేసింది. నేనుగూడా ఏదోవిధంగా ప్రసంగం ప్రారంభిద్దామనుకుంటూనే ఉపేక్ష చేయసాగాను. లీల విచిత్రంగా నా కేసి చూసి, చిన్నగా నవ్వుతూ "బావా! ఏమిటి దీర్ఘాలోచనలో పడిపోయావు! కాస్త లేచి కూర్చో. అయినా నాకు తెలియక అడుగుతాను, లాయర్లు వట్టినే ఆలోచించరు. ఇంతకీ నీ ఆలోచన కొంపలు కూల్చటానికా? కొంపలు నిల్పడానికా?" వింతగా ప్రశ్నించింది.

"నేను న్యాయవాదిని. నాపని కొంపలు నిల్పడమేగాని కూల్చడం కాదు."

"అయితే నువ్వు కలియుగంలో 20వ శతాబ్దంలో వుండతగ్గవాడివి కావు. ఆమాటలకు కాలదోషం పట్టింది. అవి ద్వాపరయుగంలోనివి. నీకు తెలియకపోతే యిప్పుడైనా తెలుసుకో."

"అల్లాగా! అయితే మన కలియుగాన్ని ద్వాపర యుగంగా మారుద్దాం."

"పిచ్చేను. మార్చడానికి నువెవ్వరువు? అయినా మేము ముందరకు పోతాంగాని వెనుకకు రాం."

"సరే! అయితే మీరెవరు రావద్దు. నేనే పోతాను."

"ఆఁ! నువక్కడవి పోతావా! నన్ను వదిలిపెట్టి. అమ్మతో చెప్పుతానుండు."

"అబ్బె! నిన్ను ఒక్కతెను వదిలిపోతానా! నిన్ను ఒక అయ్యచేతిలో పెట్టి మరీ పోతాను."

"ఛీ! నన్ను అన్యాక్రాంతం చేస్తావా? ఇది నీకు న్యాయమేనా?"

"నీవు కోరుకున్నదేగా! నీకుతోడు చూపనిదే పోవద్దన్నావుగా!"

"ఏం నీతో నన్ను తీసుకు పోకూడదు?"

"నీవు రానన్నావుగా! ముందరకు పోతానుగాని వెనకకు రాను అన్నావుగా!"

"చంటిదాన్ని అల్లాగే అన్నాననుకో! నువ్వే నాకు నచ్చచెప్పి తీసుకు వెళ్ళాలిగాని..." అని ఏదో లీల అంటూ ఉండగానే,

"నువ్వు చంటిదానివేమిటి? కొంటిదానివైతేనూ!" అన్నాను. ఆమాటకు లీలగూడ నవ్వింది. ఆతరువాత అకస్మాత్తుగా లీలముఖం గాంభీరంగా మారిపోయింది.

ఆమెముఖం అల్లా మారిపోయేసరికి నాకు ఆందోళన కలిగింది. అప్పుడు ప్రసంగం మార్చాలనుకున్నాను. అదే సమయానికి లీల తదేకదృష్టితో ఆ పార్కులో కొలనులోని బాతుల జంటను చూస్తోంది. అప్పుడు నేను లీల నడిగాను. "ఒంటరి జీవితం సౌఖ్యమా? లేక జంటజీవితం సౌఖ్యమా?" అని. ఆమె నాతో మాట్లాడక తలవంచుకుంది. ఆమె మౌనంగా కూర్చోవడం చూసి నేను మెల్లిగా అడిగాను. "అత్తయ్య తొందరపడుతోంది" అని. "ఎందుకు?" అని ప్రశ్నించింది మెల్లిగా నేలకేసి చూస్తూ. "నీ పెళ్ళికి" అన్నాను. ఆ మాటకు ఒక్కసారి నా ముఖంలోకి చూసి, మళ్ళీ ముఖం

తిప్పేసుకుని, తన చేతిదగ్గర ఉన్న చెట్టు ఆకుని తుంపుతూ "నా పెళ్ళికి తన తొందరేమిటి?" అంది కొంటెగా.

అప్పుడు నేను చెప్పాను "లీలా! మామయ్య పోయాడా! అత్తయ్య ఆడది. నేనా చిన్నవాడిని. కాబట్టి త్వరగా నువ్వు ఒక ఇంటిదాని వయ్యావంటే అత్తయ్యకు నాకుగూడ మన శ్శాంతిగా ఉంటుంది. ఏమైనా నీ జీవితాన్ని నీవు సెటిల్ చేసుకోవడం మంచిది. ఎల్లకాలం రోజులు ఒకలా ఉండవు. ఎవరికైనా ఏచెట్టు నీడో అవసరం కదా! బాగా ఆలోచించు. నీవు చిన్నదానివి కాదు. తెలివితక్కువ దానివికాదు" అన్నాను అనునయిస్తూ. నా మాటలకు నాకేసి ఆశగా రెప్ప వాల్చకుండా చూసింది. అంతలోనే ఆ చూపును దీనంగా మార్చివేసింది. నా చూపులో చూపు కలుపుతూ "నాకు చదువైతేనే గాని పెళ్ళి చేసుకోవాలని లేదు" అంది. మళ్ళీ విపరీతమైన సిగ్గుతో తల వంచుకుంది. "సరే! నీ ఇష్టమొచ్చి నప్పుడు చేసుకో" అన్నాను. లీల నా ముఖంలోకి చూసి నవ్వింది. నేనూ ఆమె నవ్వులో నవ్వు కలిపాను.

నెల్లాళ్ళ తరువాత ఒక సంఘటన జరిగింది. ఎప్పుడూ వెళ్ళని వాడిని ఆ రోజున మిత్రులతో కలిసి బీచికి పోయాను అక్కడ ఇసుక తిన్నెలమీద కూర్చొని మేమందరం ఇష్టాగోష్ఠి జరుపుతున్నాము. మా ప్రసంగంలో మనిషికి, సంఘానికీ, దేశానికి సంబంధించిన అనేక విషయాలు సముద్రంలోని తరంగాలలా పరుగు తీస్తున్నాయి. మా గోల సముద్ర ఘోషను మించిపోతోంది. పాపం సముద్రుడేదో వాడి గోల వాడు ఘోష పెడుతోంటే, గట్టుమీద కొచ్చినవాళ్ళు

వారిగోలలో వారు మునిగి ఉన్నారుగాని, వాడిగోల ఒక్కరూ వినిపించుకోవడం లేదు. చల్లని పిల్లగాలులు, నీటి తుంపరులు అనేకమూర్లు అందరిని గిలిగింతలు పెడుతున్నా ఒక్కడూ నవ్వేవాడు లేడు. పోనీ వచ్చినవాళ్ళు అందరూ ఒకచోట సమావేశమై ఏదైన ఉపయోగపడే చర్చ ప్రారంభించడం లేదు సరికదా! నిరుపయోగమైన వెకవెకలు పకపకలతో ఎంతో విలువగల కాలాన్ని వృధాచేస్తున్నారు. దూరంగా పిల్లలు బుడగ లెగరేస్తున్నారు. పిచ్చికగూళ్ళు కడుతున్నారు. దూర దూరంగా నూతన దంపతులు జంటలు జంటలుగా కూర్చుని మునిముసి నవ్వులు నవ్వుకుంటూ ఏవో పిచ్చాపాటి మాట్లా డుకుంటున్నారు. కొందరు శ్రమజీవుల పిల్లలు చెడుగుడు ఆడుతున్నారు. సముద్రంమీద బెస్తవాళ్ళు చిన్న చిన్న పడవలు వేసుకుని చేపలను పడుతున్నారు. కొందరు బట్టలు విప్పి సముద్రంలోపడి జలక్రీడ లాడుతున్నారు. నేను వాటి నన్నింటిని చూస్తూ, నా మిత్రుల ప్రసంగానికి దూరమై, నా ఆలోచనలో నేను పడిపోయి నా అనుభూతిలో నేను మునిగి పోయాను. అకస్మాత్తుగా నా కళ్ళు దూరాన ఉన్న ఒక జంటమీద పడ్డాయి. పురుషుడెవరో నాకు తెలియదు గాని ఆ స్త్రీని చూస్తే ఎక్కడో చూసినట్టు, చాలా పరిచయ మున్నట్లు అనిపిస్తోంది. బాగా పరకాయించి చూశాను అను మానం తీరడానికి. ఏమిటో ఆ చేష్టలను చూస్తే లీల గుర్తుకు వస్తోంది. లీల గుర్తుకు రావడ మేమిటి? లీలే! ఇక్కడ కెందు కొచ్చింది?..."ఎందుకు రావడమేమిటి? రోజూ బీచికి రావడం దానికలవాటే!...ప్రక్కనున్న వ్యక్తి ఎవరు? చుట్టమా....

చుట్టమైతే నాకు తెలియని చుట్టమెవరు? స్నేహితుడేమో! ఎంత స్నేహితుడైతే మాత్రం వంటరిగా వాడితో షికారుకు వస్తుందా? వచ్చిందే అనుకో ఇంతచీకటి పడేవరకు వాడితో కబుర్లు చెప్పతూ ఉంటుందా? అరె! అతను చాలా చనువుగా ప్రవర్తిస్తున్నాడే! లీల కూడా ఏమి పట్టించుకోవడం లేదు. చిర కాల పరిచితుడు లాగున్నాడు. అరె! ఎంత ధైర్యం లీలను వాడు తరుముకెడుతున్నాడు. అయ్యో! దాని చెయ్యి పట్టు కున్నాడు. ఇద్దరూ ఎక్కడికో కలిసి పోతున్నారే! నా మనసు బాధపడింది. మామయ్య మాట గుర్తుకు వచ్చింది.

"ఆనంద్! లీల అమాయకురాలు. అభం శుభం తెలి యనిది. వట్టి తొందరపిల్ల. మంచికైనా, చెడ్డకైనా నువ్వే. దాన్ని నీ చేతులలో పెడుతున్నాను. ఎల్లా చూచుకుంటావో" అని గుడ్లనీరు గుడ్లున కుక్కుతూ అన్నారు మామయ్య నాతో. అవును లీల అమాయకురాలే. లేకపోతే పరాయి వాడితో యిల్లా పచార్లు చేస్తుందా! నిజంగానే లీల అభం శుభం తెలియనిది. తెలిసినదైతే యింతసేపటివరకు యిలా వాడితో కుప్పిగంతులు గంతుతుందా! తొందరపిల్ల కాక పోతే ఏమిటి? యీ అల్లరి! నిజమే! లీలకు మంచికైనా చెడ్డ కైనా నాకంటె ఎవరున్నారు? నామీద ఎంతో నమ్మకం ఉండబట్టే దాన్ని నా చేతులలో పెట్టాడు మామయ్య. దాన్ని జాగ్రత్తగా చూడవలసిన బాధ్యత, బాగుచేయవలసిన బాధ్యత నాదే. బాధ్యతనుండి తప్పించుకు తిరగడం పెద్దమనిషి లక్షణంకాదు. నా ధర్మాన్ని, నా బాధ్యతను నేను శిరసా వహించవలసిందే. లీల తొందరు పిల్ల! అవును! అది వట్టి

తొందరు పిల్ల. దాన్ని నేను కేకలు పెట్టితే ఏం అఘాయిత్యం చేస్తుందో! పోనీ ఉపేక్షిస్తే...అమ్మో! ఇంకేమైనా వుందా? సముద్రములో మునిగి పోతోంటే, అందులో నా యెదుట మునిగి పోతోంటే చూస్తు ఊరుకోవడమా? వీల్లేదు, వీలేదు అని నా మనసులో భావన రాగానే ఉద్వేగాన్ని ఆపుకోలేక 'వీలేదు, వీల్లేదు!' అని బిగ్గరగా అరచాను. నా అరుపులకు నా మిత్రులు ఆశ్చర్య పోయారు "ఆనంద్! ఏమిటి పగలే పలవరిస్తున్నావ్?" అన్నాడు ఒకడు. "ఓరి! రాత్రి 8 గంట లయితే విడికి పగలుటరోయ్!" అన్నాడు ఇంకొకడు.

"అయినా ఎవరయినా నిద్రలో పలవరిస్తారు కాని, మెళుకువుగా వుండి పలవరిస్తారా?" అన్నాడు మళ్ళీ మొదటి వాడు.

"ఆనంద్ కూర్చొని నిద్రపోతూ పలవరించాడేమో! నీకేం తెలుసు" అన్నాడు మళ్ళీ రెండవవాడు.

"ఆనంద్! ఏమిటి వీల్లేదు వీల్లేదు అని అన్నావు" పశ్నించాడు ఒకడు.

"ఏమిటో! నాకు గుర్తు లేదు. క్షమించండి. ఇక ప్రశ్నించకండి. వస్తాను" తొందరగా అడుగులు వేసుకుంటూ కారు దగ్గరకు వచ్చాను.

కారు రోడ్డుమీద విసురుగా పరుగు పెడుతోంది. నేను వెర్రివాడిలా డ్రైవ్ చేస్తున్నాను. నా కారు చక్రాలు తిరుగుతున్నట్లే నా తలగూడ గిరగిర తిరిగిపోతోంది. నా కారు విసురుగా పరుగెడుతున్నట్లే నా ఆలోచనలు గూడ పరుగులు పెడుతున్నాయి. మధ్యమధ్య హారన్ ధ్వని, రోడ్డుమీద

నడిచేవాళ్ళను చికాకు పెడుతున్నట్లే నా ఆలోచనకు గూడా అంతరాయం కలిగిస్తోంది. శిథిలమైన మనస్సులో, వెర్రి ఆవేశంతో కారును బలాకొద్ది పరుగు పెట్టిస్తున్నాను. కొంత దూరం వచ్చేసరికి అకస్మాత్తుగా ఒక ఆడదాన్ని కేక వినిపించే సరికి నా ఆలోచనకు అంతరాయం కలిగింది. వెనకకు తిరిగి పరికించి చూచాను. నా మనసులోని దుఃఖంలాగే నా చుట్టు చీకటి ఆవరించివుంది. కారు బైటకు వచ్చి నాలుగువేపులా చూచాను. అంతా శూన్యం. ఎక్కడా అలికిడిలేదు. "ఈ కేక ఎవరిదా?" అని ప్రశ్నార్థకంగా చూచాను. "ఆడదాని కేకే! లీలది కాదుకదా!" అని ఆలోచన రాగానే నా మనసులో ఆరాట మధిక మయింది. అటు ఇటు పరుగెత్తాను. ఇంతలో మళ్ళీ వినిపించాయి. "మిష్టర్! మిష్టర్! ఇక్కడా, యీ మేడ మీద...ఏమండి! మిమ్మల్నే" అని అంటూ ఉండగానే ఎవరో నోరు నొక్కినట్లు తెలిసింది. ఆ మేడవైపు పరుగెత్తాను.

ఆ మేడమీద "సువర్ణలాడ్జి" అని రాసివుంది. అన్ని గదులు తాళాలేసి ఉన్నాయి. ఆ మేడకు రెండువైపులా మెట్లు ఉన్నాయి. కుడిచేతివైపు మెట్లపై అంతస్థులో వున్న ఒక గదిలో లైటు వెలుగుతోంది. అక్కడే యీ సంఘటన జరుగుతోందని ఆతృతతో మేడమెట్లు ఎక్క నారంభించాను. నా బూట్లు చప్పుడు విని ఆతృతతో పారిపోతూ ఒక వ్యక్తి నాకు ఎదురయ్యాడు. వెంటనే అతన్ని బంధించడానికి ప్రయత్నించాను. కానీ దొరక లేదు. పట్టు జారిపోయింది. కానీ సరిగా అతను మెట్లు దిగుతున్న సమయంలో, అంతవరకు ఆరిపోయివున్న వీధిదీపం వెలిగింది. ఆ వ్యక్తి ఎవరో గుర్తు

పట్టాను. నేను నిలువునా నీరైపోయాను. కోపం, ఉద్రేకం, అహంకారం, దుఃఖం ఒక్కపెట్టున వచ్చాయి. ఆ ఘడియలో ఆ చోట ఏవ్యక్తయితే లీలతో చనువుగా వర్తించాడో ఆ వ్యక్తేనని బాధ పడ్డాను. నేను పూర్తిగా లీలే యీ అఘాయిత్యానికి గురి అయిందని కించపడ్డాను. తొందరగా ఆ గదిలోకి పోయాను. ఆ గదిగుమ్మంలో నిలుచుని చూచాను. ఒక స్త్రీ దుఃఖిస్తూ ఆ గోడమూలను హత్తుకుపోయి మనిషి ఎవరో గుర్తుపట్టలేని స్థితిలో వుంది. ఆమె వెనుకవైపే కనుపిస్తోంది. కానీ శరీరమంతా వణికిపోతోంది. చాలా బెదిరిన దానిలా కనిపించింది. ఆమె కట్టిన పచ్చ జాకెట్టు చూచి, లీల కట్టిన నీలి జాకెట్టుకానందుకు కొంత తమాయించుకుని, నేనే ఆమెను పలకరించాను. ఒక్కసారి కంగారుపడి బెదురు చూపు చూసింది. ఆ చూపులో ఎంత కరుణ, ఎంత దుఃఖం, ఎంత ఉద్రేకం, ఎంత భీతి ఇమిడివుంది. పుష్పం తుమ్మెద నాకర్షించినట్లు, ఆమె చూపు నా మనస్సును ఆకర్షించింది. ఆమె తమాయించుకున్న తరువాత అన్నీ తెలుసుకున్నాను.

ఆమె అడ్వొకేటు సుదర్శనరావుగారి అమ్మాయి. ఆ వూళ్ళోనే మా లీల చదువుతున్న కాలేజీలోనే చదువుతోంది. వీళ్ళు చదువుతున్న కాలేజీలోనే యీ అఘాయిత్యానికి పడిగట్టిన రమేశ్ గూడ చదువుతున్నాడు. అతను వీళ్ళు చాలా రోజులనుంచి అతిస్నేహంగానే వుంటున్నారట. అతను కొంత కాలం రావుగారి ఇంటిప్రక్కనే వుంటూ అమూమకురాలగు శ్యామలతో కలిసి చదివేవాడట. కొద్దిరోజుల క్రితమే యీ సువర్ణలాడ్జికి మారాడుట. స్నేహించవున శ్యామల, అతను

తనవద్ద తీసికొన్న తన పుస్తకాన్ని తీసుకోవడానికి వచ్చిందట. ఒంటరిగా, అమాయకంగా వచ్చిన శ్యామలను చెరచడానికి సాహసించే "నమ్మకద్రోహి రమేష్" అని ఆమె అనుకోలేదట. ఈ విధంగా ఆమె కథవిని, ఆ అమ్మాయికి ధైర్యం చెప్పి "బ్రతుకు తెరువు తెలుసుకోవాలని, అమాయకంగా అందరిని నమ్మ కూడదని, లోకువ అవకూడదని, తేనెమాటలకు మోసపో కూడ"దని చెప్పి ఆమెను ఆమె ఇంటివద్దకు తీసుకువెళ్ళి నేను ఇల్లు చేరాను.

నేను గుమ్మం ఎక్కుతుంటేనే, లీల పరుగెత్తుకు వచ్చి నా చెయ్యి పట్టుకుంది. నాకేసి చూసి చిలిపిగా నవ్వింది. "నాతో రమ్మంటే రావు. అవును మాతో ఎందుకొస్తావులే" అంది వెటకారంగా. "నేను మీతో రాకూడదు" అన్నాను ముభావంగా చెయ్యి విడిపించుకుంటూ. "ఎందుచేతో తెలుసుకోవచ్చా?" ప్రశ్నించింది. "ఇప్పుడు కాదు తరువాత" అని లోపలకు పోయి బట్టలు మార్చి లీల ఇచ్చిన నీళ్ళతో కాళ్ళు చేతులు ముఖం కడుక్కొని, తువ్వాలుతో ముఖం తుడుచుకుంటూ ఉండగా "అన్నం వడ్డించా"నని అత్తయ్య వంటింట్లోంచి కేక వేసింది. నేను అన్నానికని వెళ్ళాను.

అత్తయ్య అన్నం వడ్డిస్తూ "లీలకు వయసు మీరు తోంది. త్వరగా పెళ్ళి చెయ్యాలి" అంది.

"ఇప్పుడేం తొందరొచ్చింది. చదువుకుంటోందిగా! చదువైన తరువాత చూద్దాంలే"అన్నాను.

"చూద్దాం అంటే కాదు, చేద్దాం అను" అంది.



"ఏమిటత్తయ్యా! నీపిచ్చి! నేను చేద్దాం అంటే అవుతుందా? అనకపోతే అవకపోతుందా?" చిన్నగా నవ్వాను.

"నీకు నేను ఏమి మాట్లాడినా నవ్వు వస్తుంది. నేను ఎంత మొత్తుకున్నా నామాట వినిపించుకోవు. నిన్ను పెళ్ళి చేసుకోమని చెప్పడానికి వీలు లేదుకదా! పోనీ దాని పెళ్ళయినా తొందరలో చేద్దాం అని. అదీకాక మామయ్య పోయాడు. నేనా ఆడదానిని. నీవు కాకపోతే ఎవరుచూస్తారు? నీవు కలుగచేసుకుని లీల నొక ఇంటిదాన్ని చెయ్యి బాబు!" అంది నిస్పృహతో.

"నా చేతులో ఏముందత్తయ్యా! దైవ నిర్ణయం ఎలా ఉందో! ఆ ఘడియ రావాలిగాని, నీచేతులలోను నాచేతులలోను ఉందా దాని పెళ్ళి?" అన్నాను.

"వర్షం కురవలేదని పొలాలకు నీరు లేదని ఊరుకుంటావా? చెరువునీరును పారించడంలేదు! కనుక కాలాన్ని వృధాపుచ్చకు నాయనా!" అని బ్రతిమాలింది.

"అయితే లీలకు చదువైతేగాని చేసుకోవాలని లేదుట" అన్నాను.

"అది అనడం ఎంత అందగా వుందో, నీవు వినడం గూడ అంత అందంగావుంది చదువయ్యేదాక అల్లా అంటుంది. చదువైన తరువాత పెళ్ళే వద్దంటుంది. ఇటువంటివిషయాలలో దాని మాటను పాటించడానికి దాని కేమితెలుసు? తొందరలోనే దానికి పెళ్ళి చెయ్యడం మంచిది. ఆలస్యం అమృతం విషం అన్నారు. అదీకాక మొక్కయి వంగనిది మ్రానయి వంగుతుందా? ఆలోచించు...కాలం మనం అనుకున్నంత

అనుకూలంగా లేదు ఆనంద్! అది వికృతరూపం దాల్చక ముందే దీపం వుండగానే ఇల్లు చక్కపెట్టుకోవడం మంచిది" అని అత్తయ్య ఆవేశంగా అంటోంటే, "ఏమిటత్తయ్యా! ఇవాళ నీధోరణి చాలా క్రొత్తగా వుందే!" అన్నాను. దానికి ఆమె కంటతడి పెడుతూ నా చెవిలో కొన్ని మాటలంది. నేను నిర్ఘాంతపోయాను. "అల్లాగా! యీ విషయం నేను చూచుకుంటాను. నీవేమి పట్టించుకోకు. తెలియనట్లే వుండు. అయినా! నిదానంమీద నిజం తెలియకపోదు. అన్నింటికి ఓర్పు అవసరం" అన్నాను సముదాయిస్తూ.

నేనుపోయి డాబామీద మడతమంచం వేసుకొని వెన్నెలలో పడుకుని చందమామను అనేక ప్రశ్నలు వేస్తున్నాను. ఆకాశంమీద చందమామ మేఘాలచాటున దాక్కుంటూ నాతో దోబూచు లాడుతోంది. మా పెరటి లోని జామచెట్టుమీద చిలకలు కీచుకీచుమని శబ్దము చేస్తూ చెలగాట లాడుతున్నాయి. సన్నజాజి, నైట్‌క్వీన్ పువ్వుల వాసన గాలిలో కలిసి మా డాబా అంతా ఆవరించింది. భుక్తాయాసంగా ఉండడంవల్ల వక్కపొడి నములుతూ మాగన్ను వేశాను. ఇంతలో లీల నా దగ్గరకు వచ్చి కూర్చొని, "అమ్మ ఏమిటంటోంది?" అని నన్ను అడిగింది. "ఏమన్నది?" అని తిరిగి ప్రశ్నించాను ఏమీ తెలియనట్లు. "నాకు తెలియదుకనుకనే నిన్నడుగుతున్నాను" అంది. "తెలి యనిదానికి అమ్మ ఏదో అందని ఏలా తెలిసింది?" నిల దీశాను. కోపంగా నాకేసి చూసింది. "కడుపులో కుళ్ళు

పెంచుకుని గొణుక్కోవటం కాదు. ఏదైనా ఉంటే చెప్పాలి" అంది. "చెపితే నీవు చేస్తావు కనకనా?" అని సాగదీశాను.

"ఏమిటో చెప్పు" అని అడిగింది. నేను కాసేపు ఆలోచించి మెల్లిగా మెత్తగా "నీవు ఎవరితోనో స్నేహం చేస్తున్నావట" అన్నా. వెంటనే "నేను ఎవరితోనూ స్నేహం చెయ్యడం లేదు ఒక శ్యామలతో తప్ప" అంది. నాకు చాలా ఆశ్చర్యమేసింది స్నేహం చెయ్యడం తప్పు కాదే. ఒకవేళ ఎవరితోనైనా స్నేహం చేస్తుంటే చెప్పవచ్చు కాని అది చెడుస్నేహమైన లేక అది స్నేహంకాక మరొకటైతే, పైకి చెప్పడానికి జంకు కలుగుతుంది. ఇప్పుడు లీల వరస చూస్తే అల్లాగే అనిపిస్తోంది. "ఎవరితోను స్నేహం చెయ్యడంలేదు ఒక్క శ్యామలతో తప్ప" అని నమ్మేలా చెప్పుతూ ఎలా బుకాయిస్తోందో! లీల యీ విధంగా బుకాయిస్తూ అబద్ధాలాడుతుంటే నా సహనం నశించి పోయింది. ఆవేశంలో ఆలోచించకుండా "ఔనులే! నీవు ఎవరితోను స్నేహం చెయ్యడంలేదు. కాకపోతే ఇసుక తిప్పలమీద షికార్లు చేస్తున్నావు" అన్నాను. ఆ మాటకు లీలకుగూడ ఆవేశం అవధులను దాటింది. "ఎవరు షికార్లు చేస్తున్నారు?" పౌరుషంగా ప్రశ్నించింది. లీల ఉద్రేకంతో అల్లా ప్రశ్నించేసరికి నాకు జ్ఞానోదయ మయింది. నేను పొరపాటు చేశానని గ్రహించాను క్షణం క్రితమే అర్థమయ్యాను "నిదానం మీద నిజం తెలుస్తుంది. దేనికైనా ఓర్పు అవసరమని శ్రీరంగనీతులు చెప్పాను. ఇప్పుడు తెలుసుకున్నాను, చెప్పడం ఎంతసులభమో చేయడం అంత కష్టమని. చివరకు ఇతరులకు సలహాలిచ్చిన

నేను, నా సలహాలను నేను పాటించలేక పోయాను. తొందర పడ్డాను. పొరపాటు చేశాను. ఏమి చెయ్యగలను? కాలు జారితే తీసుకోవచ్చు గాని నోరు జారితే తీసుకోగలమా!. ఆమె వేసిన ప్రశ్నకు సమాధానం చెప్పకుండా మౌనం వహించాను.

"నేనడిగినదానికి సమాధానం చెప్పవేం బావా! లా పాయింటు దొరకడంలేదా? దెప్పింది లీల.

"లీలా! చాలా చికాకుగావుండి ఏదో అన్నాను. నిన్నే మన్నానో, ఏమనుకుంటున్నానో, అనేమాట ఏదో, అనని మాట ఏదో, ఆలోచించకుండా అన్నాను. ఏమీ అనుకోకు. కాసేపు పోయిపడుకో. కాస్త మనస్సుకు శాంతికలుగుతుంది" అని బ్రతిమాలాను దీనంగా.

"శాంతి! ఇంకెక్కడి శాంతి! అనవలసినదంతా అని ఇప్పుడు మొసలి కన్నీరు కారుస్తావా?" అని లీల విసుకుగా నిందించసాగింది. అవును పోరాటంలో ప్రతిపక్షుని ముందు తల వంచితే అతనికి లోకువయే కదా! కసితీరా తలను తన్ని గాని సంధిబేరాలకు రాడు. అనాలోచితంగా రోటిలో తల పెట్టి రోకలి పోటుకు వెనుదీయడమెందుకు? "లీలా! కోపంలో నీవుకూడ నేను చేస్తున్న, చేసిన తప్పునే చేస్తున్నావు. అంతగా నీకు కసి తీరకపోతే రేపు ప్రొద్దున్నే నన్ను సావకాశంగా నోరు నొప్పి పుట్టేలా తిడుదువుగాని" అని అన్నాను లేని నవ్వును తెచ్చుకుని.

"బావా! అగ్నిజ్వాలను ప్రజ్వరిల్లచేసి మళ్ళీ ఆర్పడానికి ప్రయత్నిస్తావు ఎందుకు? మండేదాన్ని పూర్తిగా మండనియ్యి.

కపటము, కుళ్ళు, పాపం పూర్తిగా నుసియై పోయేదాక మండనియ్యి. మధ్యలో మానివెయ్యడ మెందుకు?" లీల కసి తీరా అంటూ బిగ్గరగా అరవసాగింది. లీల ఎంత చెప్పినా విన కుండా యీవిధంగా నన్ను రెచ్చకొడుతూంటే నేను సహించ లేకపోయాను. ఉద్రేకంలో కొట్టుకుపోతున్న లీల వాక్ప్రవా హాన్ని నేను 'లీలా' అని బిగ్గరగా అరచి స్తంభింపచేశాను. లీల వాగ్ధాటిని కట్టిపెట్టి కోపంతో రుసరుసా చూడసాగింది.

"లీలా! నీకు తప్పుచెయ్యడం తెలుసుగాని దాన్ని దిద్దు కోవడం తెలియదు. తప్పు చేస్తే దిద్దుకోవడమే సరియైన ఉత్తమమార్గం. అలాకాక తప్పుచేసి దాన్ని కప్పుకోవడం కోసం మళ్ళీ తప్పుచేసి, ఇదేవిధంగా తప్పటడుగులు వేస్తే చివ రకు చతికిలపడడం తప్పదు. తప్పు చేయడం మానవులకు సహజమైన విషయమే. దాన్నిగూర్చి సిగ్గుపడనక్కరలేదు. నీగురించి నీవు నాకు చెప్పకపోయినా అంతా తెలుసు. బుకా యించి, గదమాయించి నీవు నన్ను మభ్యపెట్టలేవు" అన్నాను గాంభీరంగా హెచ్చరిస్తూ.

"నిన్ను మభ్య పెట్టవలసిన అవసరం నాకేమిటి? 'యద్భావం తద్భవతి' అని ఊరికే అన్నారా! తాపట్టిన కుందేటికి మూడే కాళ్ళు అని పట్టుపట్టే మూర్ఖులను రంజింప చేయడానికి నేను మూర్ఖురాలను గాను. అయినా నా యిష్ట మొచ్చినట్లు నేను తిరుగుతాను, ప్రవర్తిస్తాను నీవెవరవు నన్నడ్డగించడానికి? నా అంతరంగిక విషయాలలో కలుగచేసు కోవడానికి నీ కెవరిచ్చారీ అధికారం? ఇకనుంచైనా నా జీవి తంలో కలుగచేసుకోక, నీ హద్దులో నీవుండడం మంచిది"

అని లీల అనేసింది. వళ్ళు తెలియని ఆవేశంలో యేమాట అనగూడదో అదే అనేసింది. నేను, నాచేత దానికి తృణప్రాయమయిపోయింది. లీల ఇంత మాట అంటుందని నే ననుకోలేదు. ఇన్నాళ్ళూ పెంచిన ప్రేమానుబంధం ఆనాడే తెగిపోయింది. ఆ ఘడియలో ఆ మాట నా హృదయాన్ని గాయపర్చింది. లీల అంటేనే అసహ్యమేసింది. ఆ రోజునుండీ లీలతో చనువుగా మాట్లాడటం మానివేశాను. లీల సంగతే వదిలేశాను. లీల ఎలాపోయినా నన్ను కానట్టు ఊరుకున్నాను. నా ప్రవర్తన మారడంచూసి, లీలగూడ చాలా మారిపోయింది. తరువాత తనుచేసిన దానికి పశ్చాత్తాప పడే ఉంటుంది. నన్ను అనేక సార్లు ప్రశ్నించింది. ప్రతిమాలింది. నేను విసుక్కుంటున్నా, నన్ను పలకరించేది. ఏదో విధంగా మళ్ళీ నన్ను చనువు చేసుకోవాలని ఎంతో తాపత్రయ పడింది. కానీ, ఆ నాటి గాయం మానలేదు. తెగిన బంధం అతకలేదు. కానీ, నేను లీల ఈ విషయాన్ని మాత్రం అత్తయ్యకు తెలియకుండా జాగ్రత్త పడ్డాము. నా సత్యాగ్రహానికి లీలలో నే నాశించిన మార్పు మాత్రం రాలేదు ఎప్పటివలె రాత్రులు పగలు షికార్లు చేస్తోంది. అందరితోనూ చిలిపిగా ప్రవర్తిస్తోంది. అందరినీ చూస్తుంది, నవ్వుతుంది, కవ్విస్తుంది, చివరకు అనుమానాన్ని కలిగిస్తుంది. లీల ప్రవర్తనకు అత్తయ్య బాధపడసాగింది.

సాయంత్రం 4 గంటలయింది. ఒక వ్యక్తి తిన్నగా, మా లీల వున్న గదివైపు మేడ మెట్లెక్కుతున్నాడు. నేను చల్లగాలికి మా తోటలో తిరుగుతున్నాను. వాడు బహుశా!

నన్ను చూసి వుండడు. చూసినా! లీల వాడికిచ్చిన అలుసు వల్ల లెక్క చెయ్యకపోవచ్చు. ఆ వ్యక్తి ఎవరో కాదు. ఆనాడు శ్యామలను బలాత్కరించిన వ్యక్తి. లీలతో చనువుగా ప్రవర్తించిన వ్యక్తి. అందుచేత నేను అతడు పసికట్టకుండా అతనిని వెంబడించాను. వాడు తిన్నగ మేడ ఎక్కి పిల్లిలా లీల గదిలో దూరాడు. నేను మెల్లగా ఆ గది కిటికీవద్దకు వచ్చి వారి సంభాషణను వినసాగాను. లీలను మళ్ళీ బీచికి రమ్మని అతడు ప్రాధేయ పడుతున్నాడు.

"మా యింట్లో నన్ను కేకలేస్తున్నారు. నీవు బీచిలో ఉండు. నేనక్కడికి వస్తాను" అని లీల అంటూవుండగా నేను, వారిని సమీపించాను.

నన్ను చూసి ఇద్దరూ కంగారు పడ్డారు లీల ధైర్యం తెచ్చుకుని నాతో ఇల్లా అంది. "ఇతను నా ఫ్రెండ్. నా క్లాసుమేటు. చాలా మంచివాడు" అంది వణుకుతున్న కంఠంతో. నేను అతనిని దీర్ఘంగా చూశాను. కంపించాడు. కంగారు పడ్డాడు. తడబడుతూ "జౌనండి!" అన్నాడు.

"నీవెవర బ్బాయివి!" అని అడిగాను సౌమ్యంగా.

"రామయ్యగారి అబ్బాయినండి" అన్నాడు బిక్కు బిక్కు మంటూ

"సువర్ణలాడ్జిలో ఉంటున్నావు కదూ?" ప్రశ్నించాను తీక్షణంగా చూస్తూ.

సందేహిస్తూ "అవును" అని తలూపాడు నోరు పెకలక పోయేసరికి.

"మీ నాన్నగారికి ఏంపని?" తిరిగి ప్రశ్నించాను.

"ఆయన గతించారు" దీనంగా ముఖం పెట్టాడు.

"మీ తల్లిగారు?"

"మా అమ్మగారాండి? పేరు గంగమ్మగారు. మా ఊళ్ళోనే వుంటున్నారు" ధైర్యంగానే సమాధానం చెప్పాడు తమాయించుకుని.

"చాలా సంతోషం. నాయనా! నాకు ఇల్లా చనువుగా కలుపుగోలుతనం కలవాళ్ళంటే ఎంతో ముచ్చట. నువ్వేమీ సందేహించ నక్కర లేదు. మా లీలకు అభ్యంతరం లేకపోతే నీవు మా యింట్లో నిరాటంకంగా విచ్చలవిడిగా సంచరించ వచ్చు" అన్నాను వ్యంగ్యంగా.

ఈ మాటకు అతను నన్ను చూసి నవ్వాడు ఆ నవ్వు కడుపులో పుట్టిందో? నాభిలో పుట్టిందో? నోటిలోంచి పుట్టిందో! గాని పెదవులలో కనిపించి పెదవులలోనే మాయ మయింది.

"బీచికి వెడుతున్నాను బావా!" అని చెప్పింది లీల.

నేను మౌనంగా అక్కడనుంచి వచ్చేశాను.

సువర్ణలాడ్జిలో సంఘటన జరిగిన దగ్గరనుంచి నా జీవితంలో ఒకనూతన శకం మేర్పడింది. ఒకవైపు లీలస్థితి విష మించటం. రెండోవైపు ఆ ఆదర్శ భావాల అందాల యువతి శ్యామల నా హృదయాన్ని ఆకర్షించి అశాంతి రేకెత్తించటం నా జీవితాన్ని క్రొత్త బాట వైపుకు మళ్ళించాయి

ఒకరోజున నేను బాంకులో పరధ్యాన్నంగా కూర్చొని వుంటే, సుదర్శనరావుగారు నన్ను చూసి "నీకోసం రెండు రోజుల నుంచి చూస్తున్నాను. దొరకడం లేదు మాట్లాడడానికి.

సాయంత్రం వెళ్ళేటప్పుడు నాకు కనిపించి మరీవెళ్ళు" అని హుకుం జారీ చేశారు. నేను ప్రాక్టీసు మొదలుపెట్టిన దగ్గర నుంచి, సుదర్శనరావుగారు నాకు అమూల్యమైన సలహాల నిచ్చి ఎంతో చేయూత నిచ్చారు.

వారి సహాయం, సహకారం లేకపోతే నేను ఇంత వాణ్ణి అయ్యేవాణ్ణి కాదు. ఆయన చెప్పిన ప్రకారమే వెళ్ళి పోయేటప్పుడు వారికోసం గేటువద్ద కారు ఆపి ఎదురు చూడ సాగాను. చాలా ప్రాక్టీస్, పేరుగల వకీలు అవడంవల్ల ఆయ నను పార్టీలు త్వరగా వదలరు. ఆయన వాళ్ళను ఎల్లాగో వదుల్చుకుని, చాలా దూరంనుంచి కిక్కిర్సిన రైలుపెట్టెలో ప్రయాణం చేసిన ప్రయాణీకునిలా చెమటలు తుడుచుకొనుచు వగరుస్తూ నన్ను చేరారు. "నీవు నామాట తీసెయ్యవని తెలిసే ఆలస్యంగా వచ్చాను. శ్రమ కలిగించినందుకు ఏమీ అనుకోకు" అన్నారు ఆప్యాయంగా.

"దానికేమిలెండి! ఇంతకీ మీరు నన్ను ఎందుకు కలవ మన్నారో?..." అని అంటూ వుండగానే "ఓ అదా! ఏముంది ఆనంద్! మొన్న వచ్చిన ఖూనీకేసు విషయమై నేను కలకత్తా వెళ్ళవలసి వచ్చింది. బహుశా నాలుగైదు వారాలు పట్టవచ్చు తిరిగి రావటాని. అందుచేత కాస్త నాకు ఉపకారం చేస్తావని" అన్నారు సుదర్శనరావుగారు దీనంగా నాకేసి చూస్తూ.

"ఉపకారమా! నావల్ల మీకు జరిగే ఉపకార మేమి టండీ!"

"అల్లా అనకు. నేను ఊరు వెడితే మా అమ్మాయి శ్యామల ఒక్కర్తె ఇంట్లో ఉండవలసి వస్తుంది. ఎప్పుడు ఏటు

వంటి అవసరము కలుగుతుందో! అస్తమానం మా ఇంటికి రకరకాల మనుషులు వస్తారు. దాన్ని వంటరిగా వదలి వెళ్ళడం ఇష్టంలేదు. వదిలక తప్పడంలేదు" అన్నారు బాధగా.

"ఓస్! ఇంతేనా! ఇంతమాత్రానికి ఇంతగా చెప్పాలా! మీ శ్యామలను మా యింటికి పంపండి! మా అత్తయ్యతో అన్నీ చెప్తాను" అన్నాను.

"ఆనంద్! అన్నీ నా నోటివెంట చెప్పించాలా! ఆమాత్రం గ్రహించలేవు! శ్యామలను ఎంత భద్రంగా చూడాలో మా ఇంటినిగూడా అంత భద్రంగా చూడాలి" అన్నారు సుదర్శనరావుగారు.

"నా ఒక్కడివల్ల అయ్యే పనేనా?" అని సందేహించాను.

"సందేహించకు. నా మాట నీవెప్పుడూ కాదనలేదు. అందువల్లనే నీకు వప్పగిస్తున్నాను" అన్నారు గట్టి నమ్మకంతో.

పెద్దవారు అంతగా చెప్తుంటే నేను ఏమీ చెప్పలేకపోయాను. నేనా చిన్నవాడ్ని. నామీద పెట్టిన బాధ్యతా చాలా పెద్దది. కాంతా కాంచనాలను జాగ్రత్తగా కనిపెట్టుకుని ఉండడమంటే మాటలా? అయినా తప్పడం లేదు. నేను అవును అనలేదు కాదు అనలేదు. ముభావంగా ఊరుకున్నాను. మౌనం అర్ధాంగీకార మన్నట్లు ఆయన అర్ధం చేసుకుని, నన్ను వాళ్ళ ఇంటికి తీసుకువెళ్ళి, ఆ యింటి వ్యవహారాలు నా కప్పగించి ఆయన ఊరు వెళ్ళారు.

నేను ప్రతిరోజు శ్యామల దగ్గరకు వెళ్ళేవాడిని. శ్యామల నాకు చాలా గౌరవము చేసేది. శ్యామలతో మాట్లాడాలంటే నాకు చాలా ముచ్చటగా ఉండేది. ముచ్చటయైన ముఖము, మధురమైన వాక్కు, వాడియైన చూపు, అణకువ కలిగిన నడవడికగల ఆమెను చూస్తే ఎవరు ఆకర్షించరు? సుదర్శనరావుగారు వెళ్ళిన రెండవ రోజున, శ్యామల షైర్ వెడదాము రమ్మంది. నేను "సరే" అన్నాను. శ్యామల తిన్నగా ఊరి వెలుపల ఉన్న వారి తోటలోకి కారు పట్టించింది. శ్యామల గాలికెగురుతున్న తన నల్లని, మృదువైన వంకీల జుట్టును సర్దుకుంటూ "కూర్చోండి!" అంది కోయిలలా అక్కడ ఉన్న సిమ్మెంటు బెంచీని చూపుతూ. నేను ఆ బెంచీమీద కూర్చున్నాను. తరువాత శ్యామలకూడ నా ప్రక్కనే కూర్చుంది.

"ఈ తోటను మా తాతయ్య వేయించాడు. ఈ తోటలోని మామిడికాయల ఆవకాయలేనిదే మా తాతయ్య ముద్దకూడ ముట్టేవాడు కాదట" అంది శ్యామల నా ఆలోచనకు అంతరాయం కలిగిస్తూ.

"అల్లాగా! మీ తాతయ్యకు ఆవకాయ అంటే ఇష్టమన్నమాట" అన్నాను.

"ఒక్క ఆవకాయే కాదు. ఇంకా గోంగూర, ములగకూర, మెంతికూర, కందికట్టు, పెసరకట్టు ఒక్కటేమిటి ప్రతిరోజు విస్తరి నిండుగా ఆధరవులు లేకపోతే ఆరోజున ఔపాసన చేసేవాడే కాదు" అంది గొప్పగా.

"అల్లాగా! అయితే, మీ తాతయ్యకు అన్ని విషయాలలోకంటే భోజనం విషయంలో శ్రద్ధ ఎక్కువ అన్నమాట!" అన్నాను మెల్లగా.

నా మాటకు శ్యామల చిన్నగా నవ్వింది. ముసలితనాన్ని రెండవ బాల్యావస్థగా చిత్రిస్తారు కవులు. ఆఖరి రోజులలో మా తాతయ్యకు అభిరుచులు ఎక్కువ అయ్యాయి. అప్పుడు మా నాన్నగారు, అదిగో! ఆ ప్రాంతములో ఆపిల్ మొక్కలను ద్రాక్షతీగెలను గూడ నాటించాడు. పాపం! తాతయ్య ఆ పండ్లను తినకమునుపే కన్నుమూసాడు. ఇప్పటికి మేము ఆకాయలు పండ్లు తినుచున్నప్పుడు తాతయ్య గుర్తుకు రాకుండా ఉండదు" అంది బెంగగా.

"పాపం! ప్రాప్తి లేకపోయింది. ఇంతకూ నీకు, మీ నాన్నగార్కి ఏమి ఇష్టం" నవ్వుతూ ప్రశ్నించాను, సంభాషణ మార్చాలని.

"నాకు పూలమొక్కలంటే ఇష్టం" అంది సిగ్గుపడుతూ.

"అందుకే కాబోలు! ఈ తోటలో ఎక్కడచూచిన ఆ మొక్కలే కనిపిస్తున్నాయి" అని తోటంతా పరకాయించి చూచాను.

"అది పనసచెట్టు కాబోలు!" అన్నాను ఒక చెట్టును చూపుతూ.

"అవును! మా అమ్మకు ఎవరో పనసచెట్టు నాటితే పనసతొనల లాంటి పిల్లలు పుడతారని చెప్పారుట. అందుచేత మా అమ్మ ఎంతో శ్రద్ధగా ఆ మొక్కను నాటి ఎంతో ఆప్యాయంగా పెంచింది. ఇప్పటికి మా నాన్నగారు ఈ

తోటలోకి వస్తే, ఈ చెట్టును చూచి కంటతడి పెట్టకుండా ఉండలేను" అంది కండ్లవెంట నీరు కారుస్తూ.

"అల్లాగా!" అన్నాను విస్తుపోతూ. సంభాషణ మార్చు దామని నేను ప్రయత్నించబోతే, మళ్ళీ తిరిగి కథ పునరావృత్త మయిందనుకున్నాను.

"ఈ తోటను కవులు కిచ్చారా?" అని ప్రశ్నించాను.

"లేదు. తోటమాలిని పెట్టి మేమే పెంచుతున్నాము. ఇదివరకు వీరన్న అనే తోటమాలి ఉండేవాడు. మా తాతయ్య కాలంనుంచి వాడే దీన్ని పెంచి పెద్దచేసి ఇంతవరకు తీసుకు వచ్చాడు. నన్ను వాడు ఎత్తుకు మోసేవాడు. ఈ తోటంత తిప్పేవాడు. పాపం! వాడి భార్య ఎవడితోనో లేచిపోతే అవమానం భరించలేక ఆనూతిలో దూకి మరణించాడు. అప్పటినుంచి, నాకుమల్లేనే యీ చెట్లుకు తోడులేక బెంగ పెట్టుకుని ఎండిపోసాగాయి. అప్పటికి ఇప్పటికి తోటను పోల్చి చూస్తే ఎంతో తేడా కనిపిస్తోంది" అంది గత విషయాలను జ్ఞాపకం చేసుకుంటూ శ్యామల.

ఇంతలో కనుచీకటి పడసాగింది. అక్కడకు దగ్గరలో పారుతున్న కాలవ వద్దున ఆరవేసిన బట్టలను మూటలు కట్టుకుని చాకలి భామలు వారి భర్తలతో కులాసాగా చలోక్తులాడుకుంటూ తిరిగి వస్తున్నారు.

అంతవరకు చేపలు పట్టుతున్న బెస్తవాళ్లు పెద్దగా కోలాహలం చేసుకుంటూ తిరిగి పోతున్నారు. పశువులను, గొర్రెలను పశువుల కాపర్లు ఇండ్లకు తోలుకు పోతున్నారు.

పక్షులు గూళ్ళను చేరుతున్నాయి. వీధిలో దీపాలు వెలుగుతున్నాయి.

"ఇవాళ తిథేమిటి?" అని ప్రశ్నించాను పరధ్యాన్నంగా ఉన్న శ్యామలను.

ఒక్కసారి ఉలిక్కిపడి "అమావాస్య" అంది తొందర పడుతూ.

"ఇవాళ అమావాస్యా! చూడు ఆకాశంలో ఆ పూర్ణ చంద్రుడ్ని" అన్నాను నవ్వుతూ. శ్యామల కూడ నాతో పాటు నవ్వుతూ "పూర్ణిమ అనబోయి అమావాస్య అన్నాను. అంతే!" అంది సిగ్గుపడుతూ.

ఇదేవిధంగా శ్యామలతో అర్థంలేని మాటలతో ఆమెను బాగా సమీపించాను. శ్యామల అదోలా నాకేసి చూస్తు చిరునవ్వు నవ్వింది.

శ్యామల దగ్గర ఒక్క ముద్దు దొంగిలించాలని నా అభిలాష. కానీ అది ఎలా సాధ్యం? ఒకవేళ శ్యామల నన్ను ప్రేమించడం లేదేమో! ఒకవేళ ప్రేమించినా ఆమెది నా లాంటి ప్రేమ కాదేమో! అయినప్పుడు నేనేమైన తొందర పడితే ఇంకేమైనా ఉందా? నన్ను కూడ ఆ రమేష్‌తో కలిపే స్తుంది. నిజంగా మగజాతినంతా నిందిస్తుంది అని అనుమా నించాను. శ్యామలకేసి పరిశీలనగా చూచాను. శ్యామల ఆకాశంలోని చందమామ కేసి తదేక దృష్టితో చూస్తు ఏదో తీవ్రంగా ఆలోచిస్తోంది.

"శ్యామల! చందమామ కేసి అంత ఇదిగా చూస్తావేం? దిష్టి తగులుతుంది జాగ్రత్త!" అన్నాను నవ్వుతూ.

"ఏమైనా! నేను చూడకుండా ఉండలేను" అంది ఆత్మీయత నొలకబోస్తూ.

"ఎందుచేతనో? తెలుసుకోవచ్చా?"అడిగాను వారగా చూస్తూ.

"నేను ప్రాకడం మొదలుపెట్టి, నాకు జ్ఞానం వచ్చిన నాటినుండి ఆ చందమామతోనే ఆడుకుంటున్నాను. అప్పుడు ఇప్పుడుగూడ ఆ చందమామతో జట్టా పట్టాలేసుకొని ఆడుకోవాలనే అభిలాష పోలేదు"అని నాకేసి చూసి "నామాటలు మీకు నవ్వు వస్తున్నాయా?" అని ప్రశ్నించింది.

నాకేమనాలో తెలియలేదు. "రష్యావాళ్ళు రాకెట్టులో లైకా అనే కుక్కను పంపారుగాని, నిన్ను పంపితే వదిలిపోయేది. నీ కోర్కె తీరేది, వారి ఆశయమూ నెరవేరేది" అన్నాను వ్యంగ్యంగా.

"రష్యావాళ్ళు రాకెట్టునో, స్ఫుత్నిక్‌నో పంపారు కానీ మన స్వార్థంకోసం నోరులేని జీవాలను కుక్కలను, కోతులను ఇలాబలి ఇవ్వడం మాత్రం సహించను" అంది బాధగా.

"ఇల్లాంటి ధర్మ సందేహాలకు, శంకలకు శాస్త్రజ్ఞులు లొంగిపోతే ఎల్లాగా! మనకు అక్కడివిషయాలెలా తెలుస్తాయి? పోనీ, ఆ కుక్కలను, కోతులను మృతవీరులుగా భావించి పూజిద్దాం!" త్యాగమూర్తులుగావర్ణిద్దాం! అన్నాను ఆమెకేసి అదోలా చూస్తూ.

"కుక్కను చంపితే ఏడుగుళ్ళు కట్టిస్తేనేగాని పాపం పోదు" అంది శ్యామల ఆవేశంతో.

"వాళ్ళ తెలిసిన ఏసు ప్రభువు ఆ విషయం చెప్పలేదు వాళ్ళకి. అయినా, తెలిసో తెలియకో ప్రతిదేశంలోను ఎందుకో అందుకు చాలా చర్చిలే కడుతున్నారు. అందుచేత వాళ్ళ చర్చిలను లెక్కపెట్టి చూస్తే వాళ్ళు ఇంకా చాలా కుక్కలను చంపవచ్చు" అన్నాను వ్యంగ్యంగా.

"మీరు చాలా చతురులండి! ఇంత ముచ్చటగా మాట్లాడుతారని నాకు తెలియదు. నే ననేది విజ్ఞానాన్ని వికసింప చేయవద్దని కాదు. అదికూడ అహింసా పద్ధతిలోనే జరగాలని నా అభిలాష. చూడండి! ఆధునిక మానవుడు సముద్రంలో చాపలా సంచరిస్తున్నాడు. ఆకాశంలో పక్షిలా విహరిస్తున్నాడు, క్రొత్త గ్రహాన్నికూడ ఖగోళంలోకి పంపాడు. అయితేమాత్ర మేంలాభం? చీమ కుట్టినా, దోమ కుట్టినా ఓర్చుకోలేడు. సర్వనాశనానికి బాంబులు ఎన్నో కనిపెట్టాడు. కానీ, తన మనసులో ఉన్న అరిషడ్వర్గాన్ని జయించడానికి ఒక్క బాంబునైనా కనిపెట్టగలిగాడు? తన మనసులోని శత్రువులను జయించి, తన్ను తాను తెలుసుకోవడం చేతకానివాడు. ఎవరినో జయించి ఎవర్నిగురించో తెలుసుకుంటాడా? నాకేం నమ్మకంలేదు. ఒకవేళ నమ్మదగినదే అయినా తనలోని శత్రువులను జయించేదాక ఎన్ని జయించినా, ఎన్ని తెలుసుకున్నా నేను ప్రశంసించేది లేదు" అంది గంభీరంగా శ్యామల.

"నీ చిన్న మెదడులో ఇంత పెద్ద భావముందని నాకు తెలియదు శ్యామలా!" అన్నాను ఆశ్చర్యపోతూ. శ్యామల నా మాటలకు సిగ్గుపడుతూ నవ్వింది.

"అయితే మరి నువ్వు ఆ చందమామతో జట్టాపట్టా లేసుకుని ఆడుకోవడం ఎల్లా జరుగుతుంది?" తిరిగి ప్రశ్నించాను.

"అది మన పూర్వులకు అలవాటైన విషయమే. నేను క్రొత్తగా కోరడంలేదు" అంది వింతగా.

"అది పూర్వులకు అలవాట! ఇది ఎప్పటి మాట?" వింతగా ప్రశ్నించాను.

"మాడండి! మనం తలుచుకుంటే మనమనస్సు ఎక్కడికైనాసరే వెళ్ళి తిరిగివస్తుంది. అనంతమైన, అలభ్యమైన ప్రదేశాలకు వెళ్ళి అన్నివిషయాలు, సూర్య చంద్రులకు కూడా తెలియని విషయాలు మన మనస్సు సంకల్ప మాత్రంచేత క్షణ కాలంలో తెలుసుకొని వస్తుంది. అందుచేతనే 'రవిగాంచనిచో కవిగాంచు' అని అన్నారు" అంది శ్యామల ఊహా ప్రపంచములో తేలిపోతూ.

"ఊహా ప్రపంచములోని మాటలు వాస్తవ ప్రపంచములో చెల్లుతాయా?" ప్రశ్నించాను గుక్క త్రిప్పుకోకుండా.

"ఒకప్పుడు ఒక శాస్త్రవేత్త రాకెట్టును చంద్రమండలములోకి పంపుతానంటే అది వాస్తవానికి విరుద్ధం. కేవలం ఊహామాత్రమే అని గేలిచేశారు అందరూ. ఇప్పుడు ఆ ఊహాయే వాస్తవము కాలేదు? అల్లాగే నా ఊహామాత్రం వాస్తవము ఎందుకుకాదు? ఊహ ఒకచోట వాస్తవము మరొకచోట అవాస్తవము అవుతుందా?" మళ్ళీ ప్రశ్నించింది శ్యామల గుక్క త్రిప్పుకోకుండా.

"ఏమో! అన్ని ఊహలు, అన్నికలలు నిజమౌ తాయా?" అన్నాను అప్రయత్నంగా. ఆమాటకు శ్యామల కూడ ఆలోచనలో పడింది. చాలాసేపు మేమిద్దరం మౌనం గానే ఉన్నాము. మా మనసులే మూగభాషలో ఏవో మాట్లాడుకుంటున్నాయి. ఆ మూగభాష తెలిసిన చెట్లు చేమలు ఆ భాష వింటూ తెలిసినట్టుగా తల లాడిస్తున్నాయి.

"నామనసెప్పుడు ఆ ఆనంద సుదాకరుని సాన్నిధ్యాన్నే కోరుతుంది" అని అప్రయత్నంగా అన్న శ్యామల మాటలు నన్ను భావ ప్రపంచంలోంచి బయటకు లాగాయి.

"ఆ ఆనంద సుదాకరునికి గూడా శ్యామల మేఘా లతో ఆడుకోవడమే ఇష్టం" అన్నాను ఆ భావాన్నే కొనసా గిస్తూ.

"శ్యామల మేఘాలతో ఆడుకుంటోంటే నక్షత్రాలకు అసూయగా వుండదూ?" సందేహాన్ని వెలిబుచ్చింది శ్యామల.

"నక్షత్రాలు అసూయ పడతాయని ఆనంద సుదా కరుడు ఆ శ్యామల మేఘాలతో దోబూచు లాడుకోవడం మానాడా? కావలిస్తే చూడు" అన్నాను ఆకాశం కేసి చూపుతూ.

శ్యామల ఆకాశం కేసి చూస్తూ "అవును. అదీ నిజమే! తన్నుమాలిన ధర్మముందా? ఒకళ్ళు అసూయ పడతారని ఎందాక బాధపడేది" అంది ఆలోచిస్తూ.

"అయితే యింకేం? బాధపడడం మానెయ్యి" అని అంటూ ఆమె భుజంమీద చెయ్యి వేశాను. వెంటనే శ్యామల

కంపించింది. నేను చెయ్యి వెనుకకు తీసుకుని తటపటాయిస్తూ నిలుచున్నాను. శ్యామల అదోలా నాకేసి చూసింది. వెంటనే "నేను బాధపడను లెండి!" అంది అర్థోక్తిగా. శ్యామల అల్లా అని సర్దుకోగానే నాకు ఒకవిధంగా ధైర్యం కలిగింది. వెంటనే ఆమెకు దగ్గరగా జరిగి కూర్చున్నాను. శ్యామల అభ్యంతరం చెప్పలేదు.

"శ్యామలా! ఆ ఆనంద సుధాకరుడు నీయెదుట నిలిచి ఆడుకోవడానికి రమ్మని పిలిస్తే నీవేంచేస్తావు?" అని అడిగాను.

"ఇక్కడే వుండు. మా నాన్నతో చెప్పి వారు వప్పుకుంటే వస్తాను అని చెప్పుతాను" అంది ఘాటుగా.

"అంటే! ఆట ఆడుకోవడానికిగూడ నీకు స్వాతంత్ర్యం లేదన్నమాట!" హేళనగా ప్రశ్నించాను.

"నాకు స్వాతంత్ర్యం లేకపోలేదు. నాకుగల గౌరవాన్ని వ్యక్తం చేసుకోవడానికే నేను వారి అనుమతిని పొందేది. నేను ఆ ఆనంద సుధాకరునితో ఆడుకుంటోంటే చూచి ఆనందించాలని మా నాన్నకు ఎప్పటినుంచో ఉంది. వారి ఆశ, నా కోరిక నెరవేరి ఆనందం లభిస్తే, ఇద్దరం పంచుకోవద్దు? నాకు వారి అనుమతి, ఆశీర్వాదం అక్కరలేదు?" సూటిగా ప్రశ్నించింది.

ఇంతవరకు లీలకే చమత్కారంగా మాట్లాడడం వచ్చుననుకున్నాను. ఇప్పుడు తెలుసుకున్నాను, వ్యంగ్యంగా, ద్వంద్వార్థంలో శ్యామలకూడ లీలకు తీసిపోకుండా మాట్లాడగలదని. "ఇంత వింతగా, తెలివిగా మాట్లాడను నీకు ఎవరు

నేర్పారు? ఎక్కడ నేర్చుకున్నావు?" ప్రశ్నిస్తూ ఆమె చేయి పట్టుకున్నాను.

"ఆ ఆనంద సుధాకరుని దగ్గరే' అంది చూపులో చూపు కలుపుతూ.

"ఇంకా నీకు ఏమేమి నేర్పాడు? అవన్నీ నాకు ఎప్పుడు చెప్తావు?" అని అడిగాను ఆశగా చూస్తూ.

"చాలా నేర్పాడు. సమయ మొచ్చినప్పుడు గాని చెప్పను" అంది.

"అంతవరకు నీవిలాగే నాతో కలిసి వుంటావా? అని అడిగాను.

"నా జీవితాంతంవరకు ఇలాగే నీతో కలసివుంటాను" అని అప్రయత్నంగా అని సిగ్గుతో తన చేతులతో ముఖాన్ని కప్పుకుంది.

నేను ఆనందం పట్టలేక ఆమె చేతులను ఆమె ముఖం నుంచి తొలగించబోయాను. శ్యామల పట్టు తప్పిచుకొని పరుగుతీసింది. నేను దానిని వెంబడించాను. చాలాసేపు ఆ చెట్లచాటున దోబూచు లాడాము. చివరకు శ్యామల పరుగెత్తి పరుగెత్తి అక్కడ వాళ్ళ అమ్మ నాటిన పనస చెట్టుదగ్గరకు వచ్చి క్రింద పడింది. నేను పరుగెత్తుకువచ్చి ఆమె చెయ్యి పట్టుకుని లేవదీశాను. శ్యామల దుమ్ముదులుపుకుని ఆ చెట్టుకు శ్రద్ధగా నమస్కారం చేసింది. నేనుగూడా ఆమె ననుసరించాను. గాలికి ఆ పనసచెట్టు అంగీకార సూచికంగా తల ఊపింది. ఇద్దరం ఆనందంలో ఒకరి నొకరం చూచుకున్నాము. త్యాగరాజు "ఎంతవారలైనా కాంత దాసులేగా" అని ఊరికే

అనలేదు. ఆ సంగీత బ్రహ్మమాట ఎందుకు పొల్లుపోతుంది? నన్ను లొంగదీసుకున్న శ్యామలను పరిశీలనగా చూచి తృప్తిగా నిట్టూర్పు విడిచాను.

ఆకాశములో నక్షత్రాలులా చీకట్లో లైట్లు వెలుగుతున్నాయి. అంతా నిశ్శబ్దంగా వుంది. ఆ రోజున మా కారు చెడిపోయిన కారణంగా నేను శ్యామలను కలుసుకుని తిరిగి వస్తున్నాను. రోడ్డు ఫుట్ పాత్ మీద అనేకమంది ముష్టివాళ్ళు పడుకుని నిద్రపోతున్నారు. కొంతమంది నిశాచరులు అభిసారికలకోసం బ్రోకర్లతో వీధి మొగలలో నిల్చొని మంతనాలు జరుపుతున్నారు. నిద్రపోయేవారిని, నిశాచరులను చూడగానే నా మనసులో రకరకాల అభిప్రాయాలు పెల్లుబక సాగాయి. ప్రతిజీవి తనకున్న ఆయుర్దాయంలో సగంభాగం యీ నిద్రకే వినియోగిస్తుంది. జంగములు స్థావరములు గూడ యీ రాత్రిలో విశ్రాంతి తీసుకుంటాయి గదా! ప్రతిజీవికి అత్యావసరమైన వాటిలో విశ్రాంతి ఒకటికదా! పనులల్లో కష్టపడి నిత్యం తీరనివ్యధకు లోనైన ఈ శ్రమజీవులకు యీ జీవకోటికి నిశ్చింతగా మేనుమరచి, మాయాలోకంతో సంబంధం లేకుండా విశ్రమించే యీ రాత్రి, యీ నిద్ర లేకపోతే లోకం ఎంత విపరీత మయ్యేది! అని అనుకుంటూ నేను సువర్ణలాడ్జి సందు సమీపానికి వచ్చేసరికి ఒక కారు ఆ లాడ్జి సందులోకి వెళ్ళింది నేను గూడ మా యింటికి ఆ సందులోంచే వెళ్ళాలి. కాని సందు మళ్ళేముందర కొంచెంసేపు పొంచివున్నా. నాకు రెండు గొంతులు వినిపిస్తున్నాయి. మగగొంతు, ఆడగొంతు. మనుష్యులను గూడా తెలుసుకోవాలనిపించింది. అవ్యక్తులకు

నేను కనిపించకుండా వారిని చూశాను. ఇంకెవరూ! మనకు మామూలేకదా! లీల, రమేష్. రమేష్ కారుదిగడానికి గారాబం చేస్తున్నాడు చంటి కుర్రాడిలా బెట్టుసరిచేస్తూ. అతన్ని దింపడంకోసం లీల గూడ కారు దిగవలసి వచ్చింది. అతను శెలవు తీసుకోవడానికి ఎందుకో సందేహిస్తున్నాడు. లీల సందేహంగా నిలుచుంది.

"లీలా నన్నింకా గుర్తించలేదా? నన్ను అర్థంచేసుకోలేవా!" అని అడిగాడు దీనంగా రమేష్.

"నిన్ను గుర్తించడానికి క్రొత్తవాడివా! లేకపోతే నాకు మతి చెడిందా? తెలుసుకోవడానికి నన్ను నీవు జిల్లా ప్రశ్నించడానికి. ఇక చాలు ప్రసంగం. చాలా ప్రొద్దుపోయింది" అని అంటూ కారు డోరు తెరువబోయింది లీల.

"అదికాదు లీల! మనం..." అని ఆపేశాడు రమేష్.

అంతవరకు నవ్వుతూ పేలుతున్న లీల ముఖం గంభీరంగా మారిపోయింది ముఖం చిట్లించుకొని "ఏమిటి ఆపేశావ్?" నిలదీసింది.

"అబ్బే ఏంలేదు! నీకు తెలియదా? నా చేత చెప్పించాలనికాని" అన్నాడు రమేష్ లీలకేసి ఆవేశంతో చూస్తు.

"అదీ నిజమే కాని నీ నోటివెంటవింటే ఎల్లా ఉంటుందో అని!" అని అంది లీల పళ్ళుకొరుకుతూ.

"అయితే నా నోటివెంట చెప్పించడం, నేను చెబుతోంటే వినడం నీకు సరదా? లీలా! ఇన్ని రోజులనుంచి మనం అన్యోన్యంగా కలిసిమెలిసి తిరిగాము ఇంకా మనకీ పట్టింపులెందుకు? ఈ రోజు నీవు నాతో కలసి నా గదిలోనే పడుకో

గూడదు?" అని అంటూ ఉద్రేకంలో ఆమె చెయ్యి పట్టుకోబోయాడు. అతను ఇల్లా మాట్లాడుతూ ఉండగా లీల తనకాలి బూటు తీసి చేత్తో పట్టుకుని సిద్ధంగా ఉంది. ఎప్పుడైతే అతను చెయ్యి పట్టుకోబోయాడో, అదే సమయంలో పట్టుతప్పించుకుని తనకాలి బూటుతో కసితీరా నాలుగు వాయించింది. "నీవు ఇంత నీచుడవనుకోలేదు. ఛ! ఛా! నీ ముఖం చూడకూడదు. నీతో మాట్లాడడమే మహాపాపం! ఇకనుంచైన బుద్ధి కలిగి హద్దు తెలుసుకుని బ్రతుకు" అని కసి తీరా తిట్టి తన కారుమీద విసురుగా తుర్రుమంది

ఆ కారు ఆ చీకట్లో అదృశ్యమయ్యే వరకు రమేష్ స్తంభించిపోయి బొమ్మలా నిలుచుండి పోయాడు. ఇంతలో వీధిలోని లైట్లు ఆరిపోయాయి. అతని ఆనందం, సంతోషం. ఆ ఘడియ చీకటయిందనుకున్నాను. నేను గూడ పశ్చాత్తాప పడ్డాను. లీల నిర్దోషత్వం ఋజువైనది. అప్పుడు అనుకున్నాను ఆడవాళ్ళను అర్థంచేసుకోవడం అసంభవమని. వాళ్ళ హృదయాలు చాలా గూఢమైనవి. కనుకనే, లీలను నేనే కాకుండా అత్తయ్య గూడ అనుమానించింది. "ఆ గళ్ళ చొక్కా కుర్రాడితో చెడ్డగా తిరుగుతోంది" అని నాతో చెప్పింది. లీల హృదయం ఎంత నిష్కపట మయింది! అయినా లీల చాలా పొరపాటు చేసింది ఎదుటవాళ్ళ హృదయాన్ని తెలుసుకోకుండా చనువిచ్చింది. పాపం! రమేష్ ఎంత పిచ్చివాడు! లీల హృదయం తెలుసుకోలేక ఎన్ని కలలు కన్నాడో! ఎన్ని మేడలు కట్టాడో గాలిలో. అవన్నీ యీనాడు చవిటి నేలలో విత్తనాలై పోయాయి. అందరి బాధా ఒకటే. అందం

మనుష్యులమే గాని మానులంగాను. ప్రతి వ్యక్తి జీవితంకోసం ధనాన్ని ఆర్జించినట్లే ఆనందంకోసం అబలను గూడ అన్వేషిస్తాడు. ఈ జీవిత రహస్య మెవరికి తెలియదు? రమేష్ మంచివాడని నే ననను. అతని దుర్మార్గం నే నిదివరలో చూచాను కానీ, చిన్నతనంలో ప్రతివ్యక్తి ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక తప్పు చెయ్యకుండా ఉండడు. ఏదో ఒక తప్పు చేశాడని, అతను తరువాత మంచిపని చేసినా చెడ్డవాడుగనుక, ఇప్పుడు గూడ వాడు చెడ్డపనినే చేశాడని దూషించడం, అనుమానించడం ఏమి న్యాయం? అదీగాక అటువంటి చెడ్డవాడితో వద్దన్నా స్నేహం చేస్తోంటే లీల మంచిగా ఉందని ఎవరు భావించగలరు? ఈ విషయంలో పొరపాటు రమేష్‌దా? లీలదా? ఇది తెలుసుకోవలసిన విషయమే! రమేష్‌గూడ పెళ్ళి కానివాడు. ఆస్తి కొద్దో గొప్పో వుంది. సామాన్యంగా చదువుంది. అన్నోదకాలకు ఏలోటూ లేదు. లీలగూడ అతనితో మితిమీరి స్నేహం చేస్తోంది. వీళ్ళిద్దరికీ ముడిపెడితే నాబరువు బాధ్యత తీరుతుందనుకున్నాను. ఈ రోజునుంచి నా జీవితం ఏ నూతన ఘట్టానికి మళ్ళబోతోందో నాకే తెలియదు.

ఆరోజునుంచి లీల పూర్తిగా మారిపోయింది. స్నేహాలు మానేసింది. షికార్లు చెయ్యడంలేదు. చివరకు చిలిపితనాన్ని గూడ విసర్జించింది. లీల ప్రవర్తనలో అకస్మాత్తుగా కలిగిన యీ మార్పుకు అత్యంత ఆశ్చర్యం, నాకు ఆనందం కలిగాయి. కానీ, లీల నన్ననుసరించసాగింది. పదే పదే నన్ను పలకరించేది. వద్దన్నా విడిచేది కాదు. నేను మాట్లాడేదాక విడిచేదికాదు. ఒక్క క్షణం కూడా నన్ను విడిచేదికాదు.

ఆయిదు నెలల తర్వాత ఒక రోజు సాయంత్రం లీల నాతో సైన్స్‌కు వస్తానంది. నేను నిరాకరించాను. లీల బిక్క ముఖం పెట్టి బొటబొటా కన్నీరు కార్చింది. నా మనసు చిన్నబోయింది. స్వేచ్ఛగా తిరిగే పక్షికి పంజర జీవితం ఎంత దుర్భరమో! లీలకుకూడ యిలా యింట్లో వంటింటి కుందేలులా కూర్చోవడం కూడ అంత దుర్భరమనుకున్నాను. పాపం! ఇన్ని రోజులనుంచి ఉగ్గపెట్టుకున్న బాధను యివాళ నా ముందు ఆవిధంగా కనపర్చింది. దాచుకుందామని ప్రయత్నించినా దాచుకోలేక పోయింది. పిచ్చి పిల్ల! అశుభం శుభం తెలియని యీ లీల తన జీవిత చక్రాన్ని ఏవిధంగా నడుపుకుంటుందోకదా! అని అనుకున్నాను.

నేను మామూలుగా శ్యామల ఇంటికి వెడితే, ఇంట్లో లేదని తెలిసింది. మరునాడు వెడితే సినిమాకు వెళ్ళిందన్నారు. నేను నిరాశతో వీధిలోకి వచ్చి యాదాలాపంగా డాబాపైకి చూచాను. శ్యామల డాబామీద పిట్టగోడవద్ద నిలుచుని వుంది. నన్ను చూడగానే, నేనామెను పసికట్టానని తెలియగానే లోనికి పారిపోయింది. శ్యామలయొక్క యీ వింత ప్రవర్తనకు అకస్మాత్తుగా గలిగిన యీ మార్పుకు నాకు ఆందోళన కలిగింది. పరిపరి విధాల ఆలోచించుకుంటూ అక్కడనుంచి తరలిపోయాను.

తరువాత వారం రోజులకు శ్యామల నాకు వంటరిగా పార్కులో కనిపించింది. ఏదో పరధ్యాన్నంగా ఆలోచిస్తూ కూర్చుంది. నేను ఆమెను సమీపించి "శ్యామలా" అని

ఆప్యాయంగా పిలిచాను. ఒక్కసారి ఉలిక్కిపడి చూచింది. కంగారుపడుతూ లేచి నిలబడింది.

"కంగారు పడకు. నేను దొంగనుకాదు, దుర్మార్గుడను కాదు" అన్నాను ఆమెను సముదాయిస్తు.

వెంటనే శ్యామల బెంచీమీద చతికిలపడి తన జాకెట్టునవున్న పెన్నును తీసి, తన హేండ్ బేగ్‌లోని తన డైరీలోని కాగితాన్ని చింపి ఏదో వ్రాయడం ప్రారంభించింది నాకు సమాధానం చెప్పకుండానే. ఆమె ప్రవర్తన నాకు మరీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

"శ్యామలా! స్త్రీలు వారి కోర్కెలు నెరవేరేందుకు అనేక నోములు నోస్తారు. ఇంతకీ నువ్వు యీ మూగనోము ఎందుకు నోస్తున్నావు?" ఆమెను కవ్విస్తూ ప్రశ్నించాను.

శ్యామలమాత్రం కొంచమైనా చలించలేదు. నామాటలను పెడచెవిని బెట్టి తన పనిలో తను నిమగ్నమైంది. నాకేం చెయ్యాలో తోచలేదు. ఆమెకేసి దీనంగాచూస్తు "శ్యామలా! నన్ను పరీక్ష చేయకు. నా జీవితాన్ని నీకు ఆధీనం చేశాను. అహర్నిశలు నీకోసం తపిస్తున్నాను. నావల్ల తప్పు జరిగితే నిస్సంకోచంగా చెప్పు. నీవు చెప్పినట్లే చేస్తాను. నన్నుమాత్రం నీట ముంచకు" అని ప్రాథేయపడుతూ అన్నాను.

శ్యామల నామాటలకు చివాలున లేచి తాను యింత వరకు రాసిన కాగితాన్ని నా చేతిలో పెడుతూ "ఇది చదువుకో! ఇక నన్ను వేధించకు! శెలవు!" అని బొంగురుపోయిన కంఠంతో అతి కష్టంమీద అని విసుగుగా దుఃఖిస్తూ వెళ్ళి

పోయింది. శ్యామల చేష్టలకు నేను ఖిన్నుడనయ్యాను. అప్రయత్నంగా ఆ కాగితంలోని అక్షరాలను చదువసాగాను.

"ఆనంద్! నీవు నావలన బాధపడ నక్కరలేదు. నేను నిన్ను బాధ పెట్టడంలేదని నీకు తెలుసు. నీ ఆశయంలో నేను ఏకీభవించలేను. కారణం నన్ను అడగకు. ఇప్పటిలాగే మళ్ళీ సాహసం చేస్తే నన్నింకా దుఃఖపెట్టిన వాడవవుతావని అర్థం చేసుకో" అని చదవగానే నా వళ్ళు ఝల్లుమంది. హృదయం బ్రద్దలయింది. కానీ, ఇంత నిష్ఠూరంగా వ్రాసినా శ్యామలను చూస్తే, నామీద ఆమెకు మమకారం నసించినట్లు కనిపించడంలేదు. ఎవరో శ్యామలచేత యీ విధంగా అనిపించి వుండాలి. లేదా ఆమె మనస్సు విరిచియుండాలి. లేకపోతే యింత నిష్ఠూరంగా వ్రాసి యింత నిష్ఠూరాన్ని ప్రదర్శిస్తూ లోలో దుఃఖాన్ని ఆపుకుంటూ విసురుగా ఎందుకు వెళ్ళిపోతుంది? కాని నేనేమి చేయగలను? ఆమె నన్ను శంకించడానికి కారణం నాకు తెలియదు. పోనీ తను నాతో చెప్పలేదు. నన్ను వేదనతో నింపింది. తనూ వేదనలో మునిగిపోయింది.

నా జీవితంలో శోకాగ్ని ప్రజ్వరిల్లింది. అది నన్ను దగ్ధం చేస్తుందేమో నాకే తెలియదు. నాకు నా జీవితంమీద విరక్తి పుట్టింది. ప్రేమించి వియోగం తెచ్చుకునేకంటే అసలు ప్రేమించకుండా వుండడమే మంచిదనుకోసాగాను. నేను చేసినదానికి, నాకు జరిగినదానికి లోలోనే పశ్చాత్తాప పడుతూ బాధపడ్డాను.

ఇంట్లో లీలకూడా నావలె బాధపడసాగింది. తీరని వ్యధకు లోనైన దానిలా కనిపిస్తోంది. తల్లికిగాని, నాకుగాని తన మనోగాధ విప్పి చెప్పదు. ఎవరితోనూ మాట్లాడదు. ఎంతసేపూ మౌనంగా కూర్చొని ఏదో ఆలోచిస్తూ వుంటుంది. ఎక్కువ బాధ కలిగినప్పుడు తనలో తానే ఏడుస్తుంది. నాకు మా యింటివరకు చూస్తే నవ్వు, ఏడుపు వచ్చాయి మా ఇంట్లోంచి వెలుగు వెన్నెల వెళ్ళిపోయి చీకటి దుఃఖం ఆవరించాయి. ఆరోజులకు యీరోజులకు ఎంతభేదం! విప్పారిన పద్మాలలా నవ్వుతూ వుండే ముఖాలు వాడిన పుష్పాలవలె మాడిపోయి వున్నాయి. నవ్వులతోను కేరింతలతోను వుండే మాయిల్లు దుఃఖాలతోను హాహాకారాలతోను విలవిల్లుతోంది. అందరం తలోమాటు భోజనాలు చేస్తున్నాము. అందరం తలోమూల కూర్చుంటున్నాము. ఎవరి ముఖంలో చూచినా విషాదం తప్ప వినోదం గోచరించడం లేదు. నేనెప్పుడూ మా యింటికి యింత దుర్గతి పడుతుందని, మాకింత దుఃఖం వాటిల్లుతుందని కలలో కూడ అనుకోలేదు. అనుకున్నవి కొన్ని జరగనట్లే అనుకోనివి కొన్ని జరిగితే ఆశ్చర్యమెందుకు? జరుగవలసింది జరుగక మానదు. జరుగనిది జరుగనే జరుగదు. మనం దేనికైన నిమిత్త మాత్రులమే. దానికోసం వ్యర్థప్రయాస పడడం తెలివితక్కువతనం.

అయినా మన పిచ్చిగాని, కాలాన్ని ఎవరు ఆపగలరు? విధిని ఎవరు తప్పించగలరు?

రాత్రి 1 గంటకు నాకు మెలుకువ వచ్చింది. నాకు వ్యాకులపాటు కలిగి నా మనస్సంతా పాడవడంతో మా

ఇంటి తోటకి పోయాను చల్లగాలికి తోయ్యానే నా తోస్తు దనే ఆశతో. ఆరోజు గడ్డు అమావాస్య. అంతా చీకటిగా ఉంది. వీధిలో వెలిగే దీపాల గూడ ఎందుచేతనో వెలగడం లేదు. దూరంగా కుక్కలు మొరుగుతున్నాయి. అప్పుడే సైరన్ కూసి మానేసింది. దూరంగా రైలు కూతలు రైలు శబ్దాలు వినిపిస్తున్నాయి. మా పెరటిలోని చెట్లన్నీ దయ్యాలలా తల లాడిస్తున్నాయి గాలికి. గుడ్లగూబలు వికృతంగా కూస్తున్నాయి. ఈంగోళ్ళు, కప్పలు రొద రొద శబ్దం చేస్తున్నాయి. పూర్ణిమ రాత్రి ఎంత శోభస్కరమైనదో అమావాస్య రాత్రి అంత వికృతమైనది కదా! ఆలోచిస్తూ ఆ తోటలో పచార్లు చేస్తున్నాను. ఇంతలో నా వెనుక గాజుల చప్పుడయింది ఒక్కసారి ఊపిరి స్తంభించిపోయింది. నాకు అబలత్వము ఆవరించింది. వెనుకకు చూడాలని నా అభిలాష. కానీ చూడ లేను. ఆ వ్యక్తే నా ముందరకు వచ్చింది. ఆ చీకట్లో ఆ వ్యక్తి ఎవరో పోల్చుకో లేకపోయాను. మా కాంపౌండు అవతల ప్రహారీ గోడవద్దనున్న ఎలక్ట్రిక్ లైటు అదేపనిగా ఊగిసలాడింది. వెంటనే మా తోటలో అలికిడయినట్లు అనిపించింది. ఇంతలో మళ్ళీ క్షణం నిశ్శబ్దం ఆవరించింది. ఒక కుక్క ఆ చప్పుడయిన వైపునుంచి వచ్చి, మా గేటు గుమ్మంగుండా బయటకు వెళ్ళిపోయింది. నాకు కొంచెం ధైర్యం కలిగింది. అంతవరకు ఆ వ్యక్తి నా వద్దనే నిలబడింది. గట్టిగా జబ్బలు పట్టుకుని "ఎవరు నీవు?" అని గర్జించాను.

ఆ వ్యక్తి నాకు సమాధానం చెప్పకుండా నా వడిలో పడి గట్టిగా నా హృదయం మీద ముద్దు పెట్టుకుని బల్లిలా

పోయింది. తరువాత నా హృదయమంతా తగిలి పోయింది. ఆ వ్యక్తి ఏమన్తోందనుకున్నాను. నాకు ఏమి చెయ్యాలో కూడ తోచలేదు. అయిదు నిమిషాల తరువాత, ఆ వ్యక్తి మాట్లాడేవరకు లీలే యీ సాహసానికి వడిగట్టిందని నాకు తెలియదు. ఇన్నాళ్ళ ఆమె విచారానికి గల కారణం నాకు ఆనాడు అర్థమయింది. నేనామెకు నిష్కర్షగా చెప్పాను. "ఆనంద్ హృదయం పరాధీన మయిందని, ఆ తాకట్టు విడిపించడం అసంభవమని."

లీల నన్నడిగింది. "నన్ను అనుమానిస్తున్నావా? రమేష్‌ను ప్రేమిస్తున్నాననుకున్నావా?" అని.

నేను రెండు ప్రశ్నలకు "లేదూ" అని మాత్రం సమాధానం చెప్పాను.

కానీ నా అంతరాత్మను చెప్పేశాను. "లీలా అదృష్టం ఏ వ్యక్తికైనా ఎప్పుడో ఒకప్పుడే వస్తుంది. ఆ అదృష్టం వచ్చి తలుపు తట్టినప్పుడు తెరువడం మాని, అవమానించి, మళ్ళీ ఇప్పుడు కావాలి రమ్మని ఆహ్వానిస్తే వస్తుందా? పోయిన ప్రాణం తిరిగి రానట్టే, విరిగిన మనస్సులు అతకవని నీకు తెలియదు?" అని ప్రశ్నించాను.

"తెలియక పొరపాటే చేశాను. ఇప్పుడు పశ్చాత్తాప పడుతున్నాను" అంది బాధపడుతూ లీల.

"తెలియక నీవు ఒక్క పొరపాటే చెయ్యలేదు. మరొకటిగూడ చేశావు"

"మరో పొరపాటా? ఏమిటది?" తెలుసుకోవాలని ప్రశ్నించింది లీల.

"లీలా! నీవు రమేష్‌ను ప్రేమించనిమాట నిజమే. నీవు అతనితో నిష్కపటమైన స్నేహం మాత్రమే చేశావు. ఇందులో నీ దోషం లేదు. కానీ, నీ విషయంలో అతను మరో అభిప్రాయంతో స్నేహం చేశాడు. అతని హృదయాన్ని తెలుసుకోకుండా అతనితో స్నేహం చెయ్యడం పొరపాటు కాదు?" సూటిగా ప్రశ్నించాను.

"తెలియక పొరపాట్లు చేశానని చెప్పుతున్నానుకదా! ఇప్పుడు నా పొరపాటు నేను తెలుసుకు పశ్చాత్తాప పడుతున్నాను. ఇంక ముందు పొరపాట్లు జరుగకుండా జాగ్రత్త పడుతున్నాను. ఇంతకంటే ఎవరుగాని ఏం చెయ్యగలరు!" అమాయకంగా ప్రశ్నించింది లీల.

"లీలా! మనం తెలిసి చేసిన, తెలియక చేసిన మనం చేసినదానికి తగిన ఫలితం అనుభవించక తప్పదు. మనం అన్ని పొరపాట్లనుంచి సద్దుకోలేము. కాలు జారితే తీసుకోవచ్చుగాని నోరు జారితే తీసుకోగలమా?"

"అయితే పొరపాట్లు చేసినవాళ్ళు ఇక మంచిగా బ్రతకడానికి అవకాశం లేదా!" అని అడిగింది లీల.

"అవకాశం ఉంది. కానీ కొంత త్యాగం చెయ్యాలి" అన్నాను.

"త్యాగమా! ఏమిటది?" ఆశగా అడిగింది.

"లీలా! నీ హృదయం పవిత్రమైనదైతే ఎదుటివాళ్ళది గూడ పవిత్రమైనదని ఎలా అనుకోవడం? కనుక నీవు ఎదుట వాళ్ళ హృదయాన్ని తెలుసుకోకుండా చనువిచ్చి రమేష్ ప్రేమకు పాత్రురాలవయ్యావు. చూడు లీలా! నిన్ను నేను

మనస్ఫూర్తిగా ప్రేమించడం లేదు. నీవూ రమేష్‌ను ప్రేమించడం లేదు. కానీ, నిన్ను నేను ప్రేమించకపోతే ఎంత బాధ పడతావో, అదేవిధంగా రమేష్‌కూడ నీవు అతన్ని ప్రేమించకపోతే అంతే బాధ పడతాడని ఊహించావా? అందరి బాధా ఒకటే. అందరం మనుష్యులమే. మనం మన జీవితాలను త్యాగబుద్ధితో సద్వినియోగం చేసుకోవాలి. మనం మనుష్యులం కాని మానులం కాదుకదా! ప్రేమించావనే అనుమానం కలిగించి, అనుమానం కలిగేలా చెలిమిచేసి, అతని తృణీకరించి, ఈడేరని కోరికలకు లోనవడం కుక్కతోక వంపు తీయడంవంటి పనేకదా! నిష్ఠూరాలు, నిందలు చదువుకున్నవాళ్ళకు, తెలివైనవాళ్ళకు తగవు. పొరపాట్లు చేసిన మాట వాస్తవం. వెనుక చేశాము, ముందు చేస్తాము. ఇప్పుడు చేస్తున్నాము. కనుక గాలిమేడల్ని కూలద్రోసి రమేషుని పెళ్ళిచేసుకుంటే నా శోకాగ్ని సగం చల్లార్చినదానవవుతావు. ఇన్నాళ్ళు మరుగుపర్చిన నా మనోనిశ్చయాన్ని నీకు చెప్పాను" అని నేను అంటూ ఉండగానే లీల "ఆం! రమేష్‌నా! నేను పెళ్ళిచేసుకోవడం? అసంభవం. ఇష్టం లేని వాడిని ఎల్లా పెళ్ళాడడము? బావా! ఇల్లా నన్ను నీవు శాసించడం న్యాయమేనా? నీవు మాత్రం నాతో చనువుగా ప్రవర్తించలేదూ? నీవు నా హృదయాన్ని తెలుసుకునే చనువిచ్చావా? బావా! నీవు ఇంతవరకు సత్యాన్ని ఒక వైపు నుంచే మాట్లాడుతున్నావు. నా మనస్సులో మమత రేపి ఇలా నన్ను మధ్యలో అన్యాయం చేస్తావా? నా బ్రతుకును

ఎశారిపాలు చేస్తావా? నా ఆశలను గంగలో కలుపుతావా?" ఆవేశంతో తన బాధనంతా వెళ్ళగక్కింది.

"లీలా! ఆవేశపడకు. నిదానంమీదగాని యదార్థం తెలుసుకోలేవు. ఇష్టంలేని పని నీవే కాదు, ఎవ్వరూ చెయ్యలేరు. అయితే కొందరకు అది తప్పదు. రమేష్‌లాగే నేను గూడ ఒక స్త్రీవల్ల పరిత్యజించబడ్డాను. అనుభవిస్తున్న నాకు రమేష్ అగచాట్లు తెలుసు. తెలిసిగూడ తప్పు చెయ్యలేను. రమేష్‌ను అగ్నిగుండంలోకి తోసి, నీకు కళ్యాణదాయకమైన యీ కృత్యం నన్ను సుఖపెట్టలేదు, నన్ను సంతోషపెట్టలేదు. ఇది ఎవరికి క్షేమకరం కాదు. రమేష్ ఎంతమందికి ఏ విషయంలో చెడ్డవాడైన నీ విషయంలో నీకు మంచివాడే. రమేష్ పూర్తిగా మారిపోయాడు. ఇదివరకటి రమేష్ కాదు. నిదానంగా ఆలోచించు" అని నేను అంటూ ఉండగానే లీల తోటంతా దద్దరిల్లేలా బావురుమని ఏడుస్తూ ఇంట్లోకి లేడిలా పరుగు తీసింది. ఇంతలో పెద్దగాలి వీచింది. వనమంతా అల్లలాడింది. ప్రకృతి మమ్మల్ని చూసి నవ్వుతోంది అనుకున్నాను. విపరీతమైన సిగ్గుతో భారంగా నిట్టూర్పు విడుస్తూ తల వంచాను

మర్నాడు రమేష్ కాఫీహోటల్లో నాకు కనిపించాడు. నన్ను చూసి చాలా సిగ్గుపడ్డాడు. నేనే రమేష్‌ను "కులాసాగా ఉన్నావా?" అని పలకరించాను. అతను నా మాట విని బొట బొటా కన్నీరు కార్చాడు. నాకు మతిపోయింది. అతని దుఃఖానికి కారణం తెలియక సతమతమయ్యాను. తరువాత అతని బాధకు గల కారణం బోధపడింది. నేనే లీల మనసు

విరుగగొట్టానని అందుచేతనే లీల తనను తృణీకరించిందని, అపోహపడి నిన్నరాత్రి నన్ను ఖూనీ చెయ్యడానికి మా తోటలో ప్రవేశించాడుట. కానీ లీలతో నేనన్న మాటలు విని నా వైఖరిని, లీల వైఖరిని గుర్తించాడట. అందుచేత, అతను, నేను అతనిమీద చూపిన సానుభూతికి పశ్చాత్తాప పడ్డాడు. అంతేకాదు. తను ఇదివరలో చేసిన తప్పిదాలను నాతో చెప్పుకుని ఎంతసేపో వాపోయాడు.

"నేను తండ్రిలేని పిల్లవాణ్ణి అవడంచేత మా అమ్మ నన్ను ఎంతో గారాబంగా పెంచింది. నేను తప్పుపని చేసినా ఆమెకు ముచ్చటగా ఉండేది. అందుచేతనే ఆమె నేను చేసిన తప్పుడు పనులకు కేకలెట్టడం, శిక్షించడం పోయి మెచ్చుకునేది, సంతోషించేది. ఈ వల్లమాలిన గారాబం, అతి ప్రేమే నా పాలిట కాలకూట విషంగా తయారై నన్ను సోమరిగాను, దుష్టుడిగాను తయారుచేసింది. చిన్నతనంలో ఇంట్లో దొంగతనాలు చేసేవాడిని, సిగరెట్లు, బీడీలు కాల్చేవాడిని. వయసువచ్చిన తరువాత నా దుర్మార్గం చాలా ముదిరింది. అప్పుడు మా అమ్మ నయాన్ని, భయాన్ని గూడ చెప్పిచూసింది. అభ్యాసమై పోవడంవల్ల నా చెడు అలవాట్లను, చెడు స్నేహాలను వదులుకో లేకపోయాను. నేను విచ్చలవిడిగా అనేక తప్పుడడుగులు వేశాను. నా స్నేహితుల చేతగూడ వేయించాను. నేను గంగలో మునిగాను. వాళ్ళనుగూడ ముంచాను. ఇప్పుడు అనుభవమైన తరువాత తెలిసింది. ఇప్పుడు పశ్చాత్తాప పడుతున్నాను. ఏడుస్తున్నాను. నేను మంచిగా ఉంటానన్న లోకం నన్ను

ఇప్పుడు నమ్మడంలేదు. నేనేమి చెయ్యాలో నాకే తెలియడం లేదు. అమాయకురాలైన శ్యామలను అన్యాయం చేయబోయి అమానుషంగా ప్రవర్తించాను. నన్ను మీరు అవరోధించి, శ్యామలనే గాక నన్నుకూడ ఘోరమైన పాపాన్ని మూట కట్టుకోకుండ చేసి కాపాడారు. మిమ్మల్ని హేళన చేశాను. చులకన చేశాను. అనేక తప్పుపనులు చేశాను. కాని, అవన్నీ గమనించకుండా, లేశమైన పగబట్టకుండా, సోదరునిలా ప్రేమతో నన్ను సంస్కరించారు. నేను వెనుక ఘనంగా తలచినవన్ని మిథ్య అని బోధపరచి నిజమైన జీవిత బాటను నాకు చూపించారు. నాకు చదువుమీద ప్రపంచంమీద విరక్తి పుట్టింది. ఎక్కడికైనా 'నా' అనేవాళ్ళకు దూరంగా పోయి ఒక చెట్టునీడను బైరాగిలా కూర్చోవాలనిపిస్తోంది. లీల కులాసాగా వుందా? నన్ను మర్చిపోయిందా?" అని దీనంగా ప్రశ్నించాడు రమేష్.

"రమేష్! గతాన్ని విస్మరించి ముందుగతి ఆలోచించు. ఆడవాళ్ళను అర్థం చేసుకోవడం చాలా కష్టం. వారి హృదయాలు చాలా గూఢమైనవి. వారి విషయాలలో తొందర పడకూడదు. పైగా వారివల్ల బైరాగులంగూడా కాకూడదు. నేను శక్తివంచన లేకుండా నీకు మేలు చేయడానికి, మేలు జరగడానికి ప్రయత్నిస్తాను. నీవు దిగులుపడకు. న్యాయమార్గాన్ని త్రొక్కి మానవుడవనిపించుకో" అని హితబోధ చేశాను.

ఈ సంఘటన జరిగిన 15 రోజులకు నేను సుదర్శన రావుగారిని కలుసుకున్నాను. ఆయన చిరునవ్వుతో నన్ను ఆహ్వానించారు.

"రావుగారూ! నేను మీవల్ల ఒక విషయం తెలుసుకొని ఒకటి అర్థించడానికి వచ్చాను. ఈ యాచకునకు అది ప్రసాదిస్తారా!" అని ప్రశ్నించాను వారి ఎదురుగా కుర్చీలో కూర్చుంటూ.

నా మాటలకు ఆయన నిర్ఘాంతపోయారు. కనుబొమ్మ లెగరేస్తూ "ఏమిటానంద్! అల్లా మాట్లాడుతున్నావ్!" అని అడిగారు.

"మీరు అన్నీ తెలిసినవారు. మరేమీ అనుకోకపోతే ఒక సంగతి అడుగుతాను. మీ అభీష్టాన్ని దాచకుండా తెలుపగలరా?" అని ప్రశ్నించాను.

"ఏ విషయమైనా నిరాటంకంగా అడగవోయ్! మనం మనం కావలసిన వాళ్ళం. ఎందుకీ లౌక్యం?" అన్నారు మందహాసం చేస్తూ.

సిగ్గుపడుతూ, చెప్పలేక చెప్పలేక అతి కష్టంమీద యిలా మొదలుపెట్టాను. "శ్యామలా నేనూ అతిగా స్నేహం చేసి, ఒకరి నొకరం అర్థం చేసుకున్నాము. శ్యామలా నేనూ గాఢంగా ప్రేమించుకున్నాము. ఈవిధంగా ప్రేమతో ఇన్నాళ్లు మీకు తెలియకుండా ప్రవర్తించినందుకు నన్ను దోషిగా ఎంచకండి. శ్యామలను వివాహం మాడాలనే అభిలాష నా హృదయాన్ని పీడిస్తోంది. ఈమధ్య శ్యామల ఎందుచేతనో నాతో మాట్లాడడం మానేసింది. చివరకు కనిపించడంకూడా

లేదు. ఒకవేళ నేను పెళ్ళి చేసుకోననే అనుమానమేమోనని ఎప్పటికైనా మీతో చెప్పవలసిందేకదా! అని ఇప్పుడు మీతో చెప్పాను. రావుగారూ! శ్యామల నాతో మాట్లాడక పోవడానికి గల కారణం ఏమిటో మీకు తెలుసా?" అని ఆత్రుతతో ప్రశ్నించాను.

రెండు నిముషాలు రావుగారు ఏదోలా ఆలోచించి, చివరకు చిరునవ్వు నవ్వి, దీర్ఘంగా నిట్టూర్పు విడిచి, ఆకాశం కేసి చూస్తూ ఇల్లా ప్రారంభించారు.

"ఆనంద్! నిన్ను నేను పూర్తిగా అర్థం చేసుకున్నాను. శ్యామలను నీకిచ్చి పెళ్ళి చెయ్యాలనే అభిలాష నా కెన్నాళ్ళ నుంచో వుంది. మీ అమ్మా, నాన్న బ్రతికున్నప్పుడు శ్యామలను నీకిచ్చి పెళ్ళి చేద్దామని చెలోక్తిగా అనుకునేవాళ్ళం. ఆనాడు చలోక్తిగాని, మీ అమ్మా, నాన్న పోయిన తరువాత నీవు యింతవాడవై వృద్ధిలోకి రావడంచూసి తప్పకుండా నీకే శ్యామల నివ్వాలని నిశ్చయించుకున్నాను. అందుకనే మీ యిద్దరకూ స్నేహం కలపడంకోసం అనేకసార్లు ప్రయత్నించి చివరకు మీ హృదయాలలో అనురాగ బీజాన్ని నాటాను. అది మొలకెత్తి ఈనాడు పుష్పించి ఫలించడానికి సిద్ధంగా వుంది. అయితే ఇప్పుడైనా శ్యామలను నీకే ఇవ్వాలని వుంది. కానీ కొద్ది రోజుల క్రితం మీ లీల మా శ్యామలతో ఏదో చెప్పుకుందట. అప్పటినుంచి శ్యామల పూర్తిగా మారిపోయింది. "లీల ప్రేమను శ్యామల మూలంగా త్రోసిపుచ్చుతున్నావ"ని ఆమె చెప్పినట్లు మా అమ్మాయి చూచాయిగా నాతో అంది. అది ఎంతవరకు నిజమో నాకు తెలి

యదు. . కనుక ఆనంద్! నీవు శ్యామలను విడిచి లీలను స్వీకరించడమే వుచితం. నిన్ను పెంచి పెద్దచేసిన అత్తమామలకు ద్రోహం చెయ్యదలచుకుంటే శ్యామలను చేసుకోవాలి. నేను పెద్దవాణ్ణి, కావలసినవాణ్ణి, నీ శ్రేయస్సు కోరేవాణ్ణి కనుక చెప్పుతున్నాను. నీవు నిష్కారణంగా మనస్సు పాడు చేసుకోకు. నీవే నీ తల్లిదండ్రుల పేరు నిలపాలి. కనుక శ్యామల ప్రశక్తి వదలి లీలను పొంది, చల్లగా, నాలుగు కాలాలపాటు జీవించి నీవు బ్రతికి బట్టకడితే మాకు అంతే చాలు!' అన్నారె ఆప్యాయంగా సుదర్శనరావుగారు నాభుజాన్ని తట్టుతూ. ఇక నేనేమి చెప్పిన నిష్ప్రయోజనమని నిశ్చయించుకుని నిరాశతో ఇంటిముఖం పట్టాను.

అణగారిన ఆశతో ఆవరించిన విషాదంతో నగర బాటను పట్టాను. నా మనసు పరిపరి విధాల పోతోంది. నాకు తెలియకుండానే నా కాళ్ళు నడుస్తున్నాయి. అనుకోకుండానే అకస్మాత్తుగా నా చెవులకు గుసగుసలు వినిపించాయి. తీరా చూస్తినికదా! ఆ మేడ సువర్ణలాడ్జి. పైనే రమేష్ గది. ఈ రాత్రివేళ యీ గదిలో ఈ గుసగుసలేమిటా? అని అనిపించింది. బూటుదెబ్బతిన్న రోజు మొదలుకుని నేటివరకు, యీ ఇంటి ముందు అనేకసార్లు ఆగి పరీక్షించాను. ఏ అలికిడి లేదు. కానీ యీ రోజున ఇలా వినబడడానికి కారణం తెలుసుకోవాలని పించింది. మెల్లిగా మేడమెట్లు నెక్క నారంభించాను. రెండు స్వరాలు వినిపిస్తున్నాయి. ప్రతి అక్షరంలోను విచారం విషాదం తాండవిస్తున్నాయి. ఇంతలో మేడమెట్లు ఆఖర య్యాయి. ఆ మేడ వరండాలోకి వచ్చాను. మెల్లిగా రమేష్

గది కిటికీ గూడా తొంగిచూచాను. కాళ్ళు వణికాయి. కళ్ళు తిరిగాయి.

తడికళ్ళతో వున్న రమేష్‌ను ఆ వ్యక్తి బ్రతిమాలుతోంది దీనంగా. శ్యామల మనసు మార్చిన లీల రమేష్‌ను దేనికోరకో ప్రేరేపిస్తోంది. లీల రమేష్‌ను అల్లా అడుగుతుందని నేననుకో లేదు.

"నన్ను నిష్కారణంగా అపార్థం చేసుకున్నావు. నీతో స్నేహం కలవక పూర్వమే మా బావకు నాకు ప్రేమ కలిగింది నీతో సహజమైన స్నేహాన్ని మాత్రమే చేశాను. నీవు ఇలా ఎందుకు బాధపడాలో నాకు అర్థం కావడంలేదు. ఇది నీకు ధర్మంగా ఉందా?" అని అడిగింది లీల. కొంచంసేపు ఆగి మళ్ళీ ఇల్లా ప్రారంభించింది. "నువ్వు ఎందుకు బాధ పడాలో నాకు అర్థం కావడంలేదు. ఉద్రేకంలో నీవు పొరపాటు చేశావు. ఆ రాత్రి నేనూ దురుసుగా ప్రవర్తించాను. మన జీవితంలో ఆ ఘట్టం జరగవలసి వుండి జరిగింది. దాన్ని గూర్చి బాధపడడం కంటె మర్చిపోవడమే మంచిది" అని ఓదార్చింది.

అవమాన భారంతో క్రుంగిపోతున్న రమేష్, లీలను ఏదైనా చేస్తాడేమో అనుకున్నాను గాని అటువంటిదేమీ జరగలేదు.

"నా గురించి నేను బాధ పడడంలేదు. నేను చేసిన దానికి బాధ పడుతున్నాను" అన్నాడు బాధగా రమేష్.

"అవును! నీవు చేసింది పొరపాటే. నీవు వేసింది తప్పటడుగే" అంది లీల సిద్ధాంతీకరణ్యంగా.

"అదే! నీ స్నేహాన్ని ఆధారం చేసుకుని ప్రేమించావని భ్రమించాను. ఎండమావులలోని నీరు నా దాహం తీర్చుతుం దనుకున్నాను. నాకు బాగా బుద్ధివచ్చింది. నాకు మంచి గుణ పాఠమే నేర్పావు లీలా! ఎందుకీ ఓదార్పులు, ముఖస్తుతి మాటలు. నీ వెందుకు వచ్చావో సూటిగా త్వరగా చెప్పు. నాకు చేతనైతే చేస్తాను" అన్నాడు రమేష్ కసురుగా.

"ఇంక నీతో ఏంచెప్పినా ప్రయోజనం లేదు. నీ హృదయం తెలుసుకోకుండా నీకు చనువిచ్చి నందుకు నాకు తగిన శాస్తే జరిగింది. నేను వేసిన తప్పుడు అడుగుకు తగిన ఫలితం అనుభవించాను. జరిగినదానికి నేను చాలా పశ్చాత్తాప పడుతున్నాను రమేష్" అని తనముఖాన్ని చేతులతో కప్పు కుని దుఃఖిస్తూ నిలుచుంది లీల.

"లీలా! ఎందుకు నీవు వచ్చావో నాకు తెలుసు. ఆ రోజు ఆ రాత్రి నీవు మీ బావను కలుసుకోగా ఆయన నీకు చేసిన బోధ విని, నేనే మీ బావ మనసు విరుగ కొట్టానని నీవు అపోహ పడ్డావు కదూ! అది అడగడానికేగా నీవు వచ్చింది? అని అడిగాడు హేళనగా.

"ఆఁ ఆవిషయం నీకెలా తెలిసింది!" అంది ఆశ్చర్యంతో.

"మనం కళ్ళుమూసుకుని వుంటే లోకం కళ్ళుమూసు కుని వుంటుందా లీల? రహస్యము ఎప్పుడో ఒకప్పుడు బట్ట బయలు కాక తప్పదు" అన్నాడు గంభీరంగా రమేష్.

"అయితే! నేను చెప్పవలసిన అవసరం లేకుండా నీకు అంతా తెలుసు నన్నమాట. చాలా సంతోషం! నీవు నమ్మి నమ్మకపో; నేను మాత్రం అందుకు రా లేదు" అంది లీల.

"అయితే ఎందుకు వచ్చావు?"

"నిన్ను ఒకటి అడగటానికి"

"ఏమిటి?"

"నీవు నాకొక ఉపకారం చెయ్యాలి."

"ఏమిటది?"

"అయితే విను. ఆరోజున నీతో బీచికి వచ్చింది మొదలుకుని మా బావ నాతో మాట్లాడడము మానేశాడు. బావ అనుమానాన్ని గుర్తించలేక, ఒక విషయంలో, బావను నా విషయంలో కలుగ జేసుకోవద్దన్నాను. తెలివి తక్కువగా ఆయన అల్లాగే నన్ను వదిలేశాడు. నీకు నాకు ఈ సంఘర్షణ జరిగిన దగ్గరనుంచి నేను బావతో చనువుగా తిరుగ నారంభించాను కాని, మా బావ, నా స్నేహితురాలైన శ్యామలను ప్రేమించాడు. మా బావ హృదయం తెలుసుకోలేక నేనే ఆయనను దూరం చేసుకున్నాను ఆయనకు అనుమానం కలిగేట్లు ప్రవర్తించాను.

శ్యామలతో మా బావ మాట్లాడి రావడంచూసి, ఆమెను, నేను నా బావను నాకు దక్కించమని, నాకు ప్రేమ బిక్ష పెట్టమని ప్రాధేయపడ్డాను. ఆమె తన ప్రేమను, నా కోసం త్యాగంచేసింది. కాని, బావ అలా బాధపడతాడేకాని నా నిర్దోషత్వాన్ని గుర్తించడు. పైగా అనుభవిస్తున్న నాకు నీ అగచాట్లు తెలుసు. తెలిసిగూడ తప్పు చెయ్యలేను అంటాడు. రమేష్! నిన్ను నేను ఎప్పుడూ ప్రేమించలేదు. నన్ను నీవు పొంది సుఖపడలేవు. నీకు నామీద మమకారమే వుంటే నీ సోదరికోసం చేతనైన ఉపకారం చెయ్యి. నీవు

చెప్పితే మా బావ నమ్ముతాడు. నీవు తలుచుకుంటే నీ యీ సోదరిని గట్టు ఎక్కించలేకపోవు" అని అంది బాధపడుతూ లీల.

రమేష్ మనసు కరిగిపోయింది. అన్నాళ్ళనుంచి నిద్ర పోతున్న మానవత్వం ఆనాడే అతనిలో మేల్కొంది. తన లాంటి ప్రేమే లీలదికూడ అనుకున్నాడు. తనకోసం లీల త్యాగం చెయ్యలేదు, తనను లీల ప్రేమించలేదు కనుక. కానీ, లీలకోసం తను త్యాగం చెయ్యాలి, లీలను తను ప్రేమించాడు కనుక. తను కష్టపడుతున్నా, తన ప్రేయసిని సుఖ పెట్టడంలోనే ప్రేమయొక్క ఔనత్యం వుందనుకున్నాడు. అందుకే ఆమె మనో నిశ్చయానికి అణుగుణంగా వర్తిస్తా నన్నాడు రమేష్. ఇంక ఆ సంభాషణ వినలేకపోయాను. మేడ మెట్లు దిగి ఇంటివైపుకు విసురుగా నడిచాను.

ఆరాత్రి ఆలోచనలోనే మునిగిపోయాను. రేపు జరిగే కర్తవ్యంగూర్చి ఆలోచిస్తున్నాను. ఇంతలో అత్తయ్య గోరు చుట్టుమీద రోకలిపోటులా ఒక సంగతి తెచ్చింది. "లీలను పెండ్లి చేసుకోవడము మామయ్య ఆశయమని, అది నేను శిరసా వహించవలసిన సమయం ఆసన్నమయిందని, మామయ్య యీ కుటుంబాన్ని నా చేతులలో పెట్టినందువల్ల కలిగే ఫలితం ఆదేనని" ఆమె నాతో అంది. అందుకు నేను "తండ్రివలె పెంచిన మామయ్య, తల్లివలె పెంచిన వీరు నాకు మాతా పితృలుగాని, అత్త మామలు కాలేరు. కనుక లీల నాకు సోదరి వంటిది. నేనెప్పుడు ఆమెను అల్లా పొందా లనుకోలేదు. కనుకనే ఆమెను తన వరుణ్ణి వెదుక్కునేవరకు వదిలేశాను" అన్నాను.

"ఇంతకాలం తీవ్రంగా అన్వేషించి నిన్ను వెదుకుంది. నీవు కాదనకు ఆనంద్! అది ధర్మం కాదు. ఏనాడో మామయ్య లీలను నీ చేతులలో పెట్టి జాగ్రత్తగా చూచుకో మని చెప్పి ఆశీర్వదించారు. పెంచినందుకు లీలను పొందితే మామయ్య ఆత్మ శాంతిస్తుంది. పదిమంది హర్షిస్తారు. అలా చెయ్యి బాబూ!" అంది అత్తయ్య.

నే నామెకు సమాధానం చెప్పలేక, అక్కడనుంచి నా గదిలోకి వెళ్ళిపోయాను. ఆ గది గుమ్మందగ్గర లీల దుఃఖిస్తూ నాకు స్వాగతం యిచ్చింది. నాకు చాలా ఆశ్చర్యమేసింది.

తనను రమేష్ పొందితే సుఖపడదని తెలుసుకున్న లీల నన్ను పొంది తనెలా సుఖపడదామనుకుంది? తనను రమేష్ అపార్థం చేసుకున్నప్పుడు, నన్ను తను అపార్థం చేసుకో లేదా?

లీల చేసే గురివిందగింజ పనులకు నాకు అసహ్య మేసింది కానీ, ఆమె మనసు మంచిదే. వాంఛాపూరితమైన ప్రేమే ఆమెను అల్లా ఆరాట పెడుతోంది.

ఇంతలో నా మెదడులో అవసానకాలంలో మామయ్య అన్న మాటలు గుర్తుకు వచ్చాయి. "ఆనంద్! లీల అమాయకురాలు. అభం శుభం తెలియనిది. వట్టి తొందరపిల్ల. మంచికైనా, చెడ్డకైనా నీవే. దానిని నీ చేతులలో పెడుతు తున్నాను. ఎల్లా చూచుకుంటావో!" అని అన్నారు గుడ్లనీరు గుడ్లన కుక్కుకుంటూ.

"దీన్ని నీ చేతులలో పెడుతున్నాను. ఎల్లా చూసుకుంటావో" అనే మాటలను పదే పదే అనుకుంటూ పరిశీలిం

చాను. అత్తయ్య చెప్పినట్లు ఆ మాటలో మామయ్య అంత ర్యము బాగా బోధ పడుతోంది. నా చేతులలో పెట్టి ".ల్లా చూచుకుంటావో!" అన్నాడుగాని, "ఎవరికిచ్చి పెళ్ళిచేస్తావో!" అనలేదు. మామయ్య సంకల్పముకూడ అదే అన్నమాట. అందరి సంకల్పము ఆదేనన్నమాట. ఇంక నేనుమాత్రము ఎందుకు అందర్ని కాదనాలి?

అందుకనే నేను లీలతో యిల్లా చెప్పాను. "లీలా! ఇంక విచారించకు. అత్తయ్యా! మన ఇంటికి నేటినుండే పచ్చ తోరణాలు కట్టించు. ఈ రాత్రే లీల పెండ్లికూతు, నేను పెండ్లికొడుకును. రేపే లగ్న సమాచారాలు ఆలోచించు" అన్నాను ఆవేశంతో.

లీల అమితానందంతో సిగ్గుపడుతూ లేడిలా పారి పోయింది. అత్తయ్య ఆనంద బాష్పాలు రాల్చింది.

"మీ తల్లిదండ్రులకు, మీ అత్తమామలకు పేరు తెచ్చి మన గౌరవాలను నిబెట్టండి" అని దీవించింది.

బరువుతోగూడిన మనసును మోయుచున్న నా దేహాన్ని నా గదిలోకి ఈడ్చుకు పోయాను ప్రశాంతంగా.

తూర్పుదిక్కు కలకలలాడగానే జీవరాసులు మేల్కొ న్నాయి. వెలుగు రాగానే నా గురించి అనేక రకాల గుస గుసలు ప్రారంభమయ్యాయి. జగజ్జీవనరావుగారి ఆసుపత్రిలో సందడి అధికమయింది. అనేక మంది మిత్రులు, బంధువులు నన్ను చూడడానికి ఆసుపత్రికి వచ్చారు. పట్టణంలో ఎక్కడ చూచినా, నా గురించే విచిత్రంగాను విస్తారంగాను చెప్పు కుంటున్నారు. కాఫీహోటళ్ళలోను, కిళ్ళీషాపులవద్ద, రోడ్డు

మొగలలోను, సందులలోను ఒక్కచోటనే ఏమిటి? ఎక్కడ పదిమంది మూగితే, అక్కడ వారిసంభాషణలో ప్రధాన పాత్ర వహించేది, నాకు జరిగిన ప్రమాదం గురించె.

"ఆనందరావుగారి ఇంటిలో పనిచేసే దేవమ్మ కళ్ళాపు చల్లడానికి పెరటిలోకి రాగానే, ఆయన వళ్ళంతా రక్తంతో తడిసి కనిపించారట మెట్లమీద. అది బెంబేలుపడి వెర్రికేక వేసింది. మేమంతా వెళ్ళి చూశాము. పాపం! లీలమ్మగారికి, ఆనందంగారికి వివాహం చేద్దాం అని కూడా అనుకున్నారు, ఆయన పోయినా, ఆ మల్లమ్మతల్లి అల్లుణ్ణి, కూతుర్ని చూచుకుంటూనే దుఃఖాన్నంతా మర్చిపోయింది. పండులాంటి పిల్లాయనకు ఎంత ప్రమాదం సంభవించింది!" అని రకరకాలుగా తలోచోట తలో పదిమంది మూగి అనుకోసాగారు.

హాస్పటల్లో నాస్థితిపరీక్షించి డాక్టర్ పెదవివిరిచాడు.

"మా బావ జీవించడా డాక్టర్?" దీనంగా అడిగింది లీల.

"రోగానికంటూ మందు వుందిగాని ఆయుర్దాయానికి మందు లేదు తల్లీ! అంతా విధి లిఖితం. దైవసంకల్పం ఎల్లా వుందో ఎవరికి తెలుసు? నాకు చేతనైనంత చేశాను, చేస్తాను" అనిపలికాడు డాక్టర్.

లీల నా మీదపడి దుఃఖిస్తోంటే, "దుఃఖించినందువల్ల జరిగేదేమిటి తల్లీ! దేవునిమీద భారంవేసి ధైర్యంగా వుండడమే మంచిది. ఇంకా నీకు ధైర్యం చిక్కకపోతే పోయి దేవుని ప్రార్థించు" అని సలహా యిచ్చాడు డాక్టర్ జగజ్జీవనరావు.

నాకు స్పృహలేదు. నా స్థితి జీవంలేని శవంలావుంది. పలువురు లీలను, అత్తయ్యను ఓదార్చారు. నాకు కలిగిన

దురవస్థకు సానుభూతి ప్రకటించారు. ప్రకృతి అంధకారానికి బానిసైంది. జీవరాసులు కళేబరాలుగా మారిపోయాయి. ఊరంతా మాటుమణిగింది. ఎక్కడనుంచో నాకు గజ్జెల సంగీతం వినిపిస్తోంది. అది నాకు చేరువవుతున్నకొద్దీ నాలో ఉత్తేజాన్ని కలిగించి, ఎనలేని ఆనందం కలిగిస్తోంది. ఏమిటో! ఆనందం, అనుభూతి చెప్పలేను. మధురాతి మధురమైన సుఖ రానుభూతి. ఆ గజ్జెల సంగీతం నాలో ఆశాజ్యోతిని వెలిగించింది. ఆ మధుర రవళి నా వీనుగవకు మరీ మరీ చేరువవుతోంది. చెంత చేరినకొలదీ ఆ సంగీతం నాకు ఎనలేని ఆనందాన్ని, బలాన్ని చేకూర్చుతోంది. అనుకోకుండా నా కనురెప్పలు తెరుచుకున్నాయి. నా కళ్ళకు మసకలు కమ్మాయి.

కొంతసేపటికి తెప్పరిల్లాను. నాకన్నులను నేను నమ్మలేకపోయాను. నన్ను చూడడానికి శ్యామల వచ్చింది. ఆమె ముఖంలోని విచారం, విషాదం నాకు స్పష్టంగా జ్యోతక మవుతోంది. ఆమెలోని ఆవేదన ఆందోళన అంతా బట్టబయలవుతోంది. పద్మదళాలవంటి కన్నులగుండా పన్నీరులాంటి కన్నీరు కారుస్తూ నిన్ను అపార్థం చేసుకున్నాను ఆనంద్! నన్ను క్షమించు. లీలను ప్రేమించి ఆమెను మోసగించావని లీల మాటలు విని నిన్ను కష్టపెట్టాను, హింసించాను. నువ్వు ఇంత పని చేస్తావనుకోలేదు. ఆనంద్! పవిత్ర హృదయాన్ని దోష భూయిష్టంగా ఎంచాను. పాపాత్మురాలిని. నన్ను క్షమించు ఆనంద్! నన్ను విడిచి వెళ్ళిపోతావా ఆనంద్!" అని హృదయ విదారకంగా దీనాలాపన చేస్తూ బావురుమంది శ్యామల.

"శ్యామలా! నువ్విల్లా బాధపడవచ్చునా? నేను నీ ప్రేమబంధీని. నేను నీ అనుమతి లేకుండా ఎక్కడకు పోగలను? నిన్ను విడిచి నేను ఎలా వెళ్ళగలను?" అని ప్రశ్నించాను అనునయిస్తూ. శ్యామల నా మాటలకు కొంత ధైర్యం తెచ్చుకుని, తెప్పరిల్లి, కళ్ళనీళ్ళు తుడుచుకొని, నా ముంగురులను తన చేత్తో సవరించసాగింది. ఇంతలో గదితలుపు చప్పుడయింది. ఒక్కసారి లీల వచ్చి ఆ గదిగుమ్మందగ్గర నిలుచుంది. శ్యామల కంగారుపడుతూ నిలుచుంది. నేను విస్తుపోయాను. లీలగూడ మమ్మల్ని చూసి క్షణంసేపు స్తంభించిపోయింది.

కొంతసేపటికి తెప్పరిల్లి లీల, శ్యామలకు దగ్గరగా వచ్చి ఆమె భుజంమీద చేయివేసి, తనచేత్తో ఆమె గడ్డం పట్టుకొని తనవైపుకు త్రిప్పుకొని, "అమ్మా! శ్యామలా! నీవు చేసిన త్యాగం అపారం. మా బావ నిన్నే మనసార ప్రేమించాడు. నీకోసం అనేక విధాల ప్రయత్నించి, చివరకు యీ అఘాయిత్యం చేశాడు. నేను పాపాత్మురాలిని. పవిత్రమైన ప్రేమజీవులను ఇంతవరకు వేరుచేశాను. ఇప్పుడైనా మించిపోయిందిలేదు. మనం వేసిన తప్పటడుగులు తీసుకోవడానికి చేసిన తప్పులు దిద్దుకోవడానికి ఇంకా అవకాశం వుంది. ఇంకా ఆ అవకాశం చెయ్యి జారిపోలేదు. మీరు నిశ్చింతగా పెళ్ళి చేసుకోండి. మా బావకు నీవు ప్రాణసమానమైన దానివి మా బావకు బహిఃప్రాణానివి, అంతఃప్రాణానివి నీవే. గతాన్నంత ఒక పీడకలగా, పాతకథగా త్రోసిపారేసి, పూర్తిగా మర్చిపోయి, మా బావను స్వీకరించు. మనస్ఫూర్తిగా చెప్తున్నాను. సందేహించకు" అని ప్రాధేయపూర్వకంగా ప్రతి

మాలి, శ్యామల చేత వప్పించి, లీల బరువైన హృదయంతో మా గది తలుపులు రెండూ చేరవేసి వెళ్ళిపోయింది.

లీల జీవితం ఈ నాడు నిరాశాపూరితమైనది. ఆమె హృదయం శిథిలమయింది. తన జీవితంలో కలిగిన కలతలను తలుచుకుని చాలాసేపు బాధపడింది. తన నిర్దోషత్వాన్ని గుర్తించకుండా, రమేష్, ఆనంద్‌లు తన విషయంలో అపోహ పడ్డారని ఎంతగానో మథన పడింది. ముందు తన కర్తవ్యమేమిటి? అని తలపగిలేలా ఆలోచించింది. కానీ ప్రయోజనం లేకపోయింది.

అంధకారంలో అడుగుల చప్పుడు వినిపిస్తోంది. ఆ శబ్దాన్ని తిన్నగా నిర్దుష్ట ప్రదేశానికే పోవచ్చు. నడిరోడ్డున నిశరాత్రి వేళ ఈ చప్పుడుకు కారణం ఏమిటో తెలియడంలేదు. ప్రతి అడుగు నిర్వేదాన్ని నిస్పృహను వ్యక్తం చేస్తున్నాయి ఆ చప్పుడు తిన్నగా సువర్ణలాడ్జి సందులోకిమళ్ళి, మళ్ళీదక్షిణాగా మళ్ళి పోసాగింది. ఆ రోడ్డుకు రెండు ఫర్లాంగులలో రైలు పట్టాలు ఉన్నాయి. సరిగా ఆశబ్దం ఆపట్టాలదగ్గరే ఆగిపోయింది. రైలు వచ్చేవేళ అయిందిగూడా. అదిగో! సిగ్నల్‌గూడ వాలింది. "అవును! తనకూ సిగ్నల్ వాలింది. కొంతసేపటిలో రెండూ గమ్యం చేరుకుంటాయి" అని అనుకుంటూ ఆ వ్యక్తి కళ్ళనుండి జలజల కన్నీరు కారింది.

"అంతే! తనూ ఆ జలకణంలా కన్నీటి బిందువులు రాలి పోవలసిందే! కాంక్షించిన కాంక్షలు కలసిరానప్పుడు, తలచి నదివేరు, జరిగినది వేరు, అయినప్పుడు తనేకాదు ప్రతిజీవరాసి అలా రాలిపోవలసిందే, కాదని మొండితనంగా నిలిస్తే ప్రకృతికి

త్పులో లేదు. తన్ను లోకం పరిహసించినప్పుడు, వెక్కిరించి నప్పుడు సహించలేదు. అలా సహించలేని జీవితం అనుభవించే కన్నా, నిశ్చింతగా సమసిపోవడమే మేలు" అని అనుకుంటూ ఆవ్యక్తి రైలుపట్టాపై తన మెడను పెట్టి దుఃఖిస్తూ పడుకుంది.

ఇంతలో ఆకాశంలో నక్షత్రాలు నవ్వుతూ వుండగా, చీకటి వెక్కిరిస్తూవుండగా, దూరాన పొగలు మిన్నుముట్టు తున్నాయి. కొంతసేపటికి ధూమశకటం ఆకలిగొన్న పులిలా గర్జిస్తూ వస్తోంది. మధ్యమధ్య శ్రుతిని విశ్రుతం చేస్తోంది. రైలు పట్టాలమీద నున్న వ్యక్తి వణకడం ప్రారంభించింది. భగవంతుడ్ని ప్రార్థిస్తున్నది. "భగవంతుడా! ఈ లోకంలో అశాంతి-పూరితమైన జీవితాన్ని గడపలేను నీ సన్నిధికి తీసుకుపో!" అని ధ్యానం చేస్తూంది.

రైలుకూతలు, సింహ గర్జనలవలె వినిపిస్తున్నాయి. రైలు చేరువకు వస్తూంది. గాండ్రు గాండ్రుమని శబ్దం చేస్తూ అచ్చు పెద్దపులిలా. ఆకలితో వున్న మృగంలా పరుగెత్తుకుంటూ వస్తూంది. ఆవ్యక్తికి వణుకు మరీ అధికమయింది. కొంతసేపటికి సొమ్మసిల్లి పడిపోయింది.

దయా దాక్షిణ్యాలు లేకుండా, మంచి చెడ్డా, పాపం పుణ్యం ఆలోచించకుండా, ఆ రైలుబండి, నిస్సంకోచంగా తనపని ముగించుకుని, తన గమ్యస్థానం చేరుకుంది పాపం! ఆ వ్యక్తి ఏమైందో? అంత పెద్దరైలు, అంత వేగంగావచ్చే ఆరైలు ఎంతో బరువుగల ఇనుప చక్రాలమీద అంతబరువునుమోస్తూ పరుగెత్తే ఆ రైలు ఆ పట్టాలమీద పరుగెత్తివెళ్ళి నప్పుడు ఇంక ఆ పట్టామీద వున్నవ్యక్తి వుంటుందా? ఆకారమైనా

దొరకకుండా యీ పాటికి తునాతునకలై పోయివుంటుంది. కానీ, ఆమె కళ్ళు తెరువగానే రమేష్ వడిలో వుంది.

"లీలా! ఎంతపని చేశావు. నేను సమయానికి ఆ కిటికీ లోంచి చూడకపోతే, నీవు కనిపించేదానివికావు నీవు నాకు కనిపించకపోతే ఎంత ఘోరం జరిగేది? లీలా! ఎందుకింత సాహసానికి వడిగట్టావు?" ఆందోళనను ప్రశ్నించాడు రమేష్.

లీల మతిపోయిన దానిలా పకపకా నవ్వింది. ఇంతలోనే బావురుమని ఏడ్చింది. జలజల కన్నీరు కారుస్తూ "రమేష్! ఎందుకు నన్ను రక్షించావు? నేను సుఖపడడం నీకు ఇష్టం లేదా?... నేను సుఖపడేరోజులు లేవు రమేష్!... లేవు... అనవసరంగా బావ నన్ను అనుమానించాడు...అవును! అనుమానించవలసిందే!... అపోహపడడానికి ఆస్కారముంది... అవును...నా ప్రవర్తనచూస్తే అపోహ పడడానికి ఆస్కారముంది...కనుకనే...నా బావ నన్ను మర్చిపోయాడు...కానీ ...కానీ...కానీ నాహృదయం ఆయన అర్థంచేసుకోలేదు... కాదు!...ముమ్మాటికి కాదు...నేనే ఆయన హృదయాన్ని అర్థంచేసుకోలేదు...ఇంక నేనెలా సుఖపడతాను?... నా కోరికలు నెరవేరనప్పుడు, నా ఆశలు అతకనప్పుడు నేనెలా సుఖపడతాను?...నేనెలా జీవిస్తాను?......అయినా!...... అయినా!...అయినా నేనెందుకు జీవించాలి?... నేను...నేను ...నేను ఎవరికోసం జీవించాలి?..." అని లీల ఆవేశంతో ఆవేదనను వెళ్ళగక్కుతూ అనగానే "నాకోసం జీవించు లీలా!" అని అన్నాడు ఉద్వేగంతో రమేష్. లీల పిచ్చిగా అతనికేసి చూసింది. "అవును లీలా! నా కోసం జీవించు. క్రిందటి జన్మ

ఫలమే ఈ నాకు మనం అనుభవిస్తున్నాము. మనం చేజేతులా చేసుకున్న కర్మఫలం ఈ జన్మలో అనుభవిస్తే ముక్తంటూ ఏదైనా వుంటే అదైనా లభిస్తుంది. లేక మళ్ళీ జన్మవస్తే, ఆ జన్మలోనైన సుఖంగా జీవించవచ్చు. చూడు లీలా! అలాకాక యీ జన్మలో గూడ యిల్లాంటి పనులే చేసి ఇంకా మూట కట్టుకుంటే, ఇక మనకు నిష్కృతే వుండదు. ముందు జన్మంటూ వుంటే, ఆ జన్మలో గూడ మనం ఇల్లాగే బాధపడవలసి వస్తుంది. ఇంక యీ విపరీత ప్రయత్నాలను విస్మరించు. ఉన్నదానితో తృప్తిపడటం, పొందిన దానితో ఆనందించడం నేర్చుకో!" అన్నాడు రమేష్ అనునయిస్తూ.

"నేర్చుకునే కాలం దాటిపోయింది రమేష్! అదేదో పసిపాపగా ఉన్నప్పుడే నేర్చుకోవలసింది. ఇప్పుడది ఎలా సాధ్యం? మొక్కయి వంగనిది మ్రానై వంగుతుందా? కాదని మొండిగా వంగదీస్తే మ్రాను ఫెళుక్కుమని విరిగి పోతుంది. వంగడానికి నేను ఇంక మొక్కను కాలేను. రోజురోజుకు మహావృక్షమానునై పోతున్నాను. ఇప్పుడది ఎలా సాధ్యం?" ప్రశ్నించింది లీల వ్యంగ్యంగ రమేష్కు దెబ్బతీస్తూ.

"లీలా! నాకు నీవలె చమత్కారంగా మాట్లాడడం తెలియదు. నా అల్పబుద్ధికి తట్టిన న్యాయమైన విషయాన్ని నీతో చెప్పాను. లీలా! నీకోసమే కదా! నేను జీవిస్తున్నది. నీవు ఆనందంగా వుంటేచూచి ఆనందిద్దామనుకున్నాను. ఈ ప్రపంచానికి నీవు దూరమైతే, నేనుమాత్రం నిలవగలనా? లీలా! నీవు వుంటేనే నా జీవితం. చెప్పు! చస్తే ఇద్దరం చద్దాం బ్రతుకుతే ఇద్దరం బ్రతుకుదాం! నేనుమాత్రం ఎవరికోసం

జీవించాలి. కనుక ఏంచేద్దామో చెప్పు. ఏపనైనాసరే ఇద్దరం కలిసే చేద్దాం!" అన్నాడు రమేష్ గాంభీరంగా.

"రమేష్! నాకోసం నీవు యిలా బాధపడడం ఎందుకో నాకర్థం కావడంలేదు. నిన్ను నేను ప్రేమించలేను. ప్రేమించడంలేదు. పైగా ప్రేమించలేనుకూడ. ఇప్పుడులేని ప్రేమను ఎల్లా తెచ్చుకోమంటావు. అతకని జీవితాలను బలవంతంగా అతికితే, అతుకు అతుకులా కనిపిస్తూనే వుంటుందికదా! ఎప్పటికైనా అతుకుఅతుకేకదా!" అంది రమేష్ను బ్రతిమాలుతూ.

"అందుకని నీవు యీ ప్రపంచాన్ని విడిచిపెడతావా? ఆత్మహత్య మహాపాపం తెలుసా? నిద్రలో పీడకలలు మనలను వేధిస్తున్నట్లే చావులోగూడ, యీ మెలుకువలేని దీర్ఘనిద్రలోగూడ ఇంతకంటె భయంకరమైన పీడకలలు నిన్ను కలవరపరుస్తాయి తెలుసా? ఆనంద్ విషయంలో వున్న త్యాగం, నీకు నా విషయంలో ఎందుకులేదు? నీచావు హర్షదాయకమైనది కాదు. నీవు చస్తే నేనూ చస్తాను, నీవు బ్రతికితే నేనూ బ్రతుకుతాను. త్వరగా తేల్చివెయ్యి. రెంటిలో మనం చేసేది ఒక్కటే సుమా!" అని గంభీరంగా అని అతి దీనంగా ఆమె కళ్ళలోకి చూశాడు రమేష్.

లీల పొరలివస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ, ఆ కటికి చీకటిలో రమేష్ హృదయాన్ని చేరి, ఆ హృదయాన్ని తన వేడి కన్నీళ్ళతో తడిపి, కడిగి, ఆ హృదయావేదన తొలగించి, అతని సేద తీర్చి, తన సేద తీర్చుకుంది.



నట్టు తీసుకునేది.

భగవంతుడు ఆటువంటివాళ్ళను కనిపెట్టిఉంటాడు గామాలు. రోశాం ఎన్నడూ మంచానపడి ఎరుగదు ఎప్పుడన్నా తలనొప్పి, జ్వరమూ వచ్చినా దానికి లెక్కలేదు. అందుచేత దానిచేత మామూలుప్రకారం పని చేయించుకునేవాళ్ళం. అదికూడా ఎంత జ్వరమైనా ఖాతరు చెయ్యకుండా మామూలు పనులన్నీ చేసేది.

మా నాన్నగారు డాక్టరై ఉండికూడా ఇంటో మా కొచ్చే రోగాలకు మందివ్వటానికి విసుక్కునేవారు. 'ఆముండను చూడండర్రా, దానికేం మందుకావాలి ! అన్ని మందులూ మనకే !' అనేవారు.'

తక్కువకులంది గనక, ఏవస్తువన్నా చప్పున కనిపించకపోతే సహజంగా, 'ఆ రోశాంముండ ఎత్తుకుపోయిందేమో,' అని అనుకునేవాళ్ళమన్నమాటేగాని అది ఎన్నడూ యదార్థంగా దొంగతనంచేసి ఎరగదు ఇంటో ఉండే వెండిసామానూ, నగలూ, అక్కడక్కడాపెట్టిన చిల్లరడబ్బులూ, అది ఎన్నడూ ముట్టుకోకపోగా జాగ్రత్తచేసిపెట్టేది కూడానూ. ఆటువంటిబుద్ధి పనిచేసేవాళ్ళలో అరుదు.

పెళ్ళయేవరకూ రోశాం మా యిళ్ళలో పనిచేస్తూనే ఉందనుకోండి దానికి పెళ్ళయితే మా యింటో మనిషికి పెళ్ళయినట్టేఉంది. అమ్మ దానికో రూపాయిన్నర చీరా, నాలుగణాలు గుడ్డకూడా పెట్టింది. పెళ్ళయిన ఏడాదికల్లా అది పిల్లాణ్ణెత్తుకొస్తే అమ్మ మళ్ళీ పిల్లాడిచేతిలో అణా పెట్టింది.

'నువ్వెళ్ళావు, మళ్ళీ యింటికి అనువయిన పనిమనిషి దొరకలేదే !' అన్నది అమ్మ.

'అదేం దమ్మగారూ !' అన్నది రోశాం ఆహర్దాగా.

'ఆఁ ! అంతా, రూపాయిస్తావా ! రెండిస్తావా ? అని అడిగే వాళ్ళేనే ! రూపాయిలు పోగేసుకూర్చున్నామూ !' అన్నది అమ్మ.

'రోజులు మా రుండిపోతాన్నయ్యమ్మా,' అన్నది రోశాం....

రోశాం మొగుడు మా వూళ్ళో చేరటంతో రోశాం మళ్ళీ మాకు దగ్గరయింది. పనిలోకి వస్తుందేమోనని ఆశపడ్డాంకూడా, కాని రోశాం మొగుడు అదోరకంమనిషి. దానికితగ్గవాడుకాడు. వాడికిపొగరు. మేమంతా డబ్బున్న వాళ్ళమని వాడికి కడుపుమంట. తనకూడా మేడలూ మిద్దెలూ లేవని

ఏడుపేమో! అందుచేతే వాడికి ఎక్కడా కుదురుగా నౌకరీ చేసుకునే గీతలేదు. రోశాంవంటి మంచిముండకు అటువంటి నిర్భాగ్యుడు దొరకటం చాలా విచారకరం...

మంచివాళ్ళకి కాలంకాదు. అందుచేతనే రోశాం, పాపం, అన్ని ఇక్కట్లు పడ్డది, ముందు దాని మొగుడికి ఉద్యోగం పోయింది. ఏదో నాలుగురాళ్ళు తెచ్చుకుంటున్న వెధవ ఊరికే ఉండగూడదూ? సమ్మెలుట, సమ్మెలు!

వాడికి ఓ చెంప ఉద్యోగంపోయి ఉన్న స్థితిలో రోశాం పెద్దపిల్లవాడికి రోగం వచ్చింది. ఇంటో ఏ పూటకూడా ఓ గింజలేదు. దానికా చాకిరిలేదు ఎట్లా గడుస్తుందీ; ఎవరిస్తా రేమిటి? ఎందుకిస్తారు! రెక్కాడితేనే డొక్కాడుతుంది. పిల్లవాడికి మందూ మాకూ లేదు.

మా యింటో యింటిమనిషల్లే పెరిగిన పిల్ల ఇన్ని అగచాట్లు పడుతూంటే మాకు కష్టంగానే ఉంది మరి కాని ఎవరిరాత ఎవరు తప్పిస్తారు గనకా? కాని అంత ఇబ్బందిలోనూ అది దేహి అని ఎవర్నిగానీ అడిగిందా? అదెంత మహా ఇల్లాలో! ఒకవేళ మేం ఇచ్చినా తీసుకుని ఉండేది కాదు. సందేహంలేదు.

కష్టాలు ఒంటరిగా రావుగదాని మొదట్లో దాని మొగుణ్ణి ఎరెస్టు చేసి తీసుకుపోయినారు. మర్నాడే పిల్లాడు చచ్చాడు ఆ తరవాత రోశాం మంచం పట్టిందని తెలిసింది. చూసేవాళ్ళు లేరు. కాచిపోసేవాళ్ళు లేరు. ఎంతకాలం బతుకుతుందీ?

'నీకీ పాడు ప్రపంచంతో రుణం తీరిపోయింది, నా వెంటరా,' అని భగవంతుడే దాన్ని తీసుకుపోయినాడు.

దానిపేర ఆ రెండో నలుసు మాత్రం బతికి ఉన్నాడు. వాణ్ణి ఎవరో దగ్గిరికి తీసి సాకుతున్నారుట అన్నిటికీ ఆ భగవంతుడే దారి చూపిస్తాడు. భూమ్మీద నాలుగు మెతుకులు ప్రాప్తం ఉండాలేగానీ, ఏ దేముడో, ఏ ధర్మరాజో ఆదుకోకపోడు...

ఏమయినా అద్ది మాత్రం మహా ఇల్లాలు దానికి మళ్ళీ జన్మంటూ ఉండదు. అది పోయిందంటే మా మూడిళ్ళ వాళ్ళకీ మా సొంతమనిషి పోయినట్టే ఉందన్నమాట. అభిమానాలు గుణాన్నిబట్టి రావాలిగాని కులాన్నిబట్టి వస్తాయా ఏం?



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA110B103 |
| పుస్తకం పేరు | తప్పడదుగులు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 89 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | ch.Ramya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |